Approved by the Text Book-Committee, Madras.



# భారతపుత్రులు

(రెండవ భాగము)

గ్రంథకర్త:

కాటుమంచి కొండలరావు బి. ఏ.,

అసిస్టెంటు మునిసిపల్ హైస్కూల్,

బెజవాడ.





పబ్లిషర్సు:

మారుతి రాం అండ్ కో.,

ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు అండ్ బుక్కుసెల్లర్సు,

బెజవాడ.

1931

 [వెల 0-9-0

# మారుతి హిందూదేశచరిత్రలు

గ్రంథకర్తలు:

యస్. యస్. సోమయాజులు గారు B. A., L. T.,

మునిమాణిక్యం నరసింహారావు గారు B. A., L. T.,

| | |
|---|---|
| మారుతి హిందూదేశచరిత్ర కథలు 4,5, అప్రూ॥ | 0-5-0 |
| ఆంధ్రదేశచరిత్ర కథలు 5 తి॥ అప్రూ॥ | 0-5-0 |
| మారుతి హిందూదేశచరిత్ర మొదటిఫారం అప్రూ॥ | 0-8-0 |
| మారుతి హిందూదేశచరిత్ర రెండవఫారం అప్రూ॥ | 0-12-0 |
| మారుతి హిందూదేశచరిత్ర మూడవఫారం డిటో | 0-12-0 |
| మారుతి హిందూదేశచరిత్ర నాల్గవఫారం | 1-0-0 |

# మారుతి జాగ్రఫీలు

గ్రంథకర్త.

ఆడిదం నారాయణమూర్తి పంతులు M. A., L. T.,

హెడ్ మాస్టర్, మునిసిపల్ స్కూల్ అనకాపల్లి

| | |
|---|---|
| విశాఖపట్నంజిల్లా భూగోళం అప్రూవుడ్ | 0-4-0 |
| చెన్నరాజధాని భూగోళం అప్రూవుడ్ | 0-6-0 |
| మారుతి జాగ్రఫి I st ఫారమునకు అప్రూవుడ్ | 0-8-0 |
| మారుతి జాగ్రఫి రెండవఫారమునకు అప్రూవుడ్ | 0-10-0 |
| మారుతి జాగ్రఫి మూడవఫారమునకు అప్రూవుడ్ | 0-12-0 |

దొరుకువారు:—

## మారుతి రాం అండ్ కో, బెజవాడ.

# భారతపుత్రులు.

(రెండవ భాగము)

గ్రంథకర్త:

K. KONDAL RAO, B.A.,
Asst. Municipal High School, Bezwada.



పబ్లిషర్సు:

మారుతి రాం అండ్ కో.,
ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు అండ్ బుక్కు సెల్లర్సు,
బెజవాడ.

1930

ఆంధ్రముద్రాక్షరశాల, తెనాలి.

# విషయసూచిక







# భారతపుత్రులు.

## (రెండవ భాగము)





### 1. చంద్రగుప్తుఁడు.

ఈ చంద్రగుప్తుఁడు హిందూదేశమును పాలించిన ప్రథమచక్రవర్తి. ఇతఁడు పాటలీపుత్రమును రాజధానిగఁ జేసికొని మగధసామ్రాజ్యమును బరిపాలించెను. మగధ పురాతనకాలమునుండియు నార్యావర్తమున మిగుల ప్రఖ్యాతివడసిన మహారాజ్యము.

పూర్వమీమగధరాజ్యమును జరాసంధుఁడనువాఁడు పాలించెను. అతని పరాక్రమమునకు భీతిల్లి యాదవులు మధురానగరమువిడిచి ద్వారకానగరంబును బ్రవేశించిరి. జరాసంధుఁడు పెక్కండ్రురాజులను బంధించెననియు, నాతఁడు మహాపరాక్రమవంతుఁడనియుఁ జెప్పఁబడియున్నది. ధర్మరాజు రాజసూయయాగము సేయ సమకట్టినప్పుడు శ్రీకృష్ణభీమార్జునులు,

మగధకు రాజధానియు, జరాసంధునినివాసమునగు గిరివ్రజ
పురమునకరిగి యాతనివధించి, యాతనికుమారుఁడగు సహ
దేవుని రాజ్యమునందు నిలిపిరని, మహాభారతమునఁ జెప్పఁ
బడియున్నది. భారతసంగ్రామమున నీసహదేవుఁడు పాండవ
పక్షమున నిల్చి, ఘోరముగఁబోరాడి స్వర్గముఁ జేరెను. సహ
దేవుని సంతతివారు మగధరాజ్యమును వేయేండ్లుపాలించిరి.
కడపటివాఁడు రిపుంజయుఁడు. శునకుఁడనుమంత్రి యాతనిం
జంపి తనపుత్త్రుఁడగు ప్రద్యోతనునకు మగధరాజ్యాభిషేకము
గావించెను. ప్రద్యోతనుని సంతతివారైదుగురు మాగధనేలిరి.
ఇందు కడపటివానిపేరు నందివర్ధనుఁడు. శునకుఁడు రిపుంజయు
నిఁజంపి సామ్రాజ్యమాక్రమించినట్లే, శిశునాగుఁడను మంత్రి
నందివర్ధనునిఁజంపి, రాజ్యమాక్రమించెను. ఈతని వంశమునకు
శిశునాగవంశమని పేరుకలిగెను. ఈవంశమువారు క్రమక్రమ
ముగాఁ బదుగురు రాజ్యమేలిరి. ఉదయుఁడనువాఁడు పాట
లీపుత్త్రమును గట్టించెనని చెప్పుదురు. ఉదయుని తరువాత
నందివర్ధనుఁడు, మహానందియను రాజులు రాజ్యముజేసిరి. మహా
నందితో క్షత్త్రియకులమునశించినదనియుఁ, దరువాత రాజ్య
ముఁజేసినవారు శూద్రులనియుఁ గొందఱియభిప్రాయము.
మహానందికి ఔరససంతానములేదు. మహాపద్ముఁడను నొక
దాసీపుత్త్రుఁడు మాత్రము గలఁడు. ఈతనికి సర్వార్థసిద్ధి, ధన
నందుఁడు, మహాబలియను నామములుగూడఁగలవు. ఈతఁడు
సంఖ్యాతీతమైన ధనము నార్జించెనఁట! ఈతనికి బ్రాహ్మణులే
మంత్రులుగనుండిరి. అందులో రాక్షసుఁడనువాఁడుముఖ్యుఁడు.

ఈతఁడు రాజ్యతంత్రమును, సకలశాస్త్రములును సంపూర్తిగ నెఱింగినవాఁడు. వీరాగ్రేసరుఁడు. మహాపద్మనందునిచే మిగుల మన్ననలఁ బొందుచు రాజ్యభారమంతయు రాక్షసుఁడు నడుపుచుండెను.

మహాపద్మునకు 'ఇర' యనుభార్యయు, 'మురా' యను నుంపుడుకత్తెయుఁ గలరు. ఇరకు తొమ్మండ్రుసుతులుదయించిరి. ఈ తొమ్మండ్రుగురును, మహాపద్మనందుఁడును గలిసి నవనందులనఁబడిరి. మురకు జనించినవానిని మౌర్యుఁడనిరి. ఈమౌర్యుఁడే చంద్రగుప్తుఁడు. చంద్రగుప్తుఁడు రాజలక్షణసమన్వితుఁడై యుండెను. ఏకారణముచేతనోగాని నందులతనివిషయమున మిగుల నసూయవహించుచు నీతనిఁ దుదముట్టింప యత్నించుచుండిరి. చంద్రగుప్తుఁడది యెఱిఁగి, కనుజాగరూకతతోఁ జరించుచుఁ దగినవానిసహాయము నపేక్షించి సమయమునకై నిరీక్షించియుండెను.

ఇట్లుండఁ జంద్రగుప్తునకుఁ జాణక్యసహాయము లభించెను. ఈ చాణక్యుఁడు—భూసురుఁడును, నీతిశాస్త్రకర్తయగు చణకుని నందనుఁడు. సమస్తశాస్త్రములును సంపూర్తిగఁ జదివినవాఁడు. రాజ్యతంత్రము బాగుగ నెఱింగినవాఁడు. సకలధర్మవిదుఁడు. కార్యదీక్షగలవాఁడు. ప్రతి విషయమునందును బృహస్పతి, శుక్రుఁడు మొదలగువారితోఁ దుల్యుఁడని చెప్పవచ్చును; కాని, యీతనికి దురాగ్రహము, పట్టుదలయు నైజగుణములై యున్నవి. ఈతఁడొకనాఁడు నందులసభకు వచ్చి యున్నతాసనమధిష్ఠించెను. ఆసమయమున నందులచ్చటికి

వచ్చి, చాణక్యుని వికటంబరసి, నందులమంత్రులు వలదనిపలు
కుచున్నను వినక వారాచాణక్యుని పీఠముగుండి లాగివేయిం
చిరి. అప్పుడు చాణక్యుని జుట్టుముడి విడిపోయెను. అతని
ముఖమునఁ గ్రోధము మూర్తీభవించెను. అతఁడు పండ్లు పట
పటఁగొఱుకుచు, సచ్ఛాత్రసభ్యులెల్లరు వినుచుండ "భూసురో
త్తముఁడనైన నన్ను సభయం దవమానించిన మీయంతము
జూచెదను. నన్నెట్లు పీఠమునుండి లాగించితిరో యట్లే మిమ్ము
సింహాసనమునుండి లాగించి మీశిరములఁదునిమించెద. అంత
వఱకును నాశిరోజములను ముడివేయ" నని ఘోరశపథముఁ
జేసెను. కాలరుద్రునిచందమున నొప్పుచున్న యాచాణక్యుని
శాంతిపఱుప, నందులేవిధమైన ప్రయత్నమును సేయలేరు.

ఇది యంతయు నాసభయందున్న చంద్రగుప్తుఁడు
చూచుచునేయుండెను. అట్లు శపథముఁజేసి చాణక్యుఁడు సభ
విడిచిపోవుచుండెను. చంద్రగుప్తుఁడును నాతని వెనువెంటనే
కొంతదూరమరిగినపిదప, నెవ్వరును లేకుండుటఁజూచి, చాణ
క్యుని సమీపించి, భక్తివినయంబులు సూచించుచుఁ దత్పా
దంబులకు నమస్కరించి, నందులు తన్నుఁగూర్చిచేయుచున్న
కుట్రలుచెప్పి రక్షింపుమని వేడికొనెను. చాణక్యుఁడు దయాం
తరంగుఁడై చంద్రగుప్తునకిట్లుపలికెను. "వత్సా! మదీయ
పరిభావమెఱుంగఁజాలక మూఢాత్ములగు నందులు నేఁడు
నన్నుఁబరాభవించిరి. కానిమ్ము. తత్ఫలంబును వారు శీఘ్ర
కాలములోనె యనుభవింతురుగాక! నన్నువారు సామాన్య
బ్రాహ్మణునిగా భావించిరి. పూర్వము బ్రాహ్మణులలో

మాత్రము సామాన్యులుండిరా! చతుర్వేదములనభ్యసించి,
వైదికాచారపారీణులై, తపోవృత్తినుండిన బ్రాహ్మణులయం
దుఁగూడఁ బెక్కండ్రు "ఇదంబ్రాహ్మ్య, మిదంక్షాత్ర" మని
భుజబలపరాక్రమమున విజృంభించి, వైరివీరదర్పాంధకారులై
విలసిల్లినవారెందఱో కలరు. త్రేతాయుగాంతమున బ్రాహ్మ
ణుండైన పరశురాముఁడు పితృవధాసంజనిత క్రోధాగ్నిజ్వా
లలఁజల్లార్చుకొనుటకు, మదాంధులయిన భూపతులగళంబులను
నిజహస్తాలంకృతకృపాణమున నిరువదియొక్కమాఱులు ఛేదిం
చి, తద్రక్తమునఁ బితృక్రియలఁదీర్చి, తత్కళేబరంబులను
నిర్జరలోకమునకు సోపానములుగఁజేసినాఁడు. ధరామరవంశ
సంభూతుఁడైన ద్రోణాచార్యుఁడు భారతరణంబునఁ గౌరవ
పక్షముననిలిచి, తన యస్త్రవిద్యాప్రావీణ్యము లోకమునకుఁ
దెలియఁజేయ, విరోధితండములశిరములను కరాసికిఁ బలియిచ్చి,
వీరస్వర్గమంది శాశ్వత యశంబందినాఁడు. మఱియు నాతని
సుతుఁడును, బావమఱఁదియునగు కృపాచార్యుఁడును నట్టి
వారే. చంద్రగుప్తా! నీవు నందులకు భయమందవలదు.
నాయండనుండుము. నిన్నుఁ దేఱిచూచుటకు ఫాలాక్షునికైనఁ
దరముకాదు. నందవంశనిర్మూలనమొనర్చి నిన్ను మగధ
రాజ్యసింహాసనాసీనుం జేసెదఁగాక".

చంద్రగుప్తుఁడు చాణక్యుని వాక్యములకెంతయో సంత
సించెను. ఇఁకఁ జాణక్యుఁడు దనశపథముదీర్చుకొనుటకుఁ బ్రయ
త్నము సేయఁదొడంగెను. అతఁడు చంద్రగుప్తుని వెంటఁబెట్టుకొని
తన మిత్రుఁడయిన యిందుశర్మకడ కేగి, తన ప్రతిజ్ఞఁగూర్చి

చెప్పి యాతనిసహాయమును గోరెను. ఇందుశర్మ క్షపణక
వేషమున నందులఁ జేరి, విశ్వాసముగలుగునట్లు నటించుచు,
నచ్చటిరహస్యములెల్ల జాణక్యునకుఁ దెలుపుచుఁ దగిన సహా
యము సేయుటకు సమ్మతించెను. చాణక్యుఁ డచ్చటినుండి
బయలుదేరి, చంద్రగుప్తసమేతముగా సింహళపురాధీశుఁడగు
పర్వతరాజుకడకరిగెను. పర్వతరాజునకును మగధరాజునకును
బద్ధవైరముకలదు. చాణక్యుఁడు తన ప్రతిజ్ఞలను పర్వతరాజు
నకుఁ దెలిపి, యాతనిసహాయము నపేక్షించెను. నందరాజ్య
ములో నర్ధభాగము తనకిచ్చుపద్ధతిని పర్వతరాజు సహాయము
సేయ సమ్మతించెను. పర్వతరాజు సహాయమునఁ జాణక్యచం
ద్రగుప్తులు మగధకు రాజధానియగు పాటలీపుత్రమును
ముట్టడింప సేనలతో బయలుదేరిరి. నందులీవార్తవిని సరయూ
తీరమున శత్రువులఁ దాకుటకు వేచియుండిరి. ఇందుశర్మ నం
దులకడఁ జేరి, మాయఁబన్ని వారిని జాణక్యుని వలయందుఁ
జిక్కించెను. అంతటఁ జాణక్యుఁడు నందులసంహరించి, తన
శపథములో నర్ధభాగము దీర్చుకొనెను.

నందమంత్రులలో ముఖ్యుఁడు రాక్షసుఁడని యింతకుఁ
బూర్వమే చెప్పఁబడినదికదా! రాజ్యనిర్వహణమున నాకాల
మున నీతనితో సమానులులేరని ప్రఖ్యాతిఁగాంచెను. ఇతఁడు
స్వామిభక్తిపరాయణుఁడు. నందసంహారమున నీతనికిఁగలిగిన
దుఃఖమునకు మేరలేదు. నందకుల సంహారమయినను జాణ
క్యుఁడు స్వామిభక్తిపరాయణుఁడగు రాక్షసునకుభీతిల్లి పాటలీ
పుత్రమును బ్రవేశింపలేదు; కాని యాతఁడు మగధసింహాస

నముపైఁ జంద్రగుప్తునిఁ గూర్చుండఁబెట్టుటకు యత్నించు
చుండెను. నందులు సంహరింపఁబడినను రాక్షసుఁడు తన
స్వామిభక్తిని వెల్లడిసేయుటకుఁ జంద్రగుప్త, చాణక్య పర్వత
రాజులఁ జంపుటకనేకప్రయత్నముల సేయుచుండెను. ఈపని
యుద్ధమునవలన నెఱవేఱదు. ఈరాక్షసునియొక్క విషకన్యకాశ్లా
ఘాపమునందనరు నొక యువతికలదు. ఇంతకుమున్నే చాణ
క్యుని తంత్రమువలన నందులయొక్క జీవసిద్ధియను పేర క్షపణక
వేషమునయున్న యిందుశర్మంబిలిచి "క్షపణకా! నేనునీయెడలఁ
జేసిన యపరాధములకుఁగాను గానుకగా నీవిషకన్యకనర్పించు
చున్నాను. దీనిని స్వీకరించి నన్ను మన్నింపు" మని చంద్ర
గుప్తునితోఁబలుకమని రాక్షసుఁడు పలికెను. క్షపణకవేషధరుఁ
డగు నిందుశర్మ చాణక్య చంద్రగుప్తుల పక్షమువాఁడేకదా!
ఆతఁడు చాణక్య చంద్రగుప్తులకడకరిగెను. రాక్షసుని తంత్ర
మెఱింగిన చాణక్యుఁడు జీవసిద్ధితోఁ జంద్రగుప్తునకు స్త్రీవాంఛ
లేదని తెలిపి, నెమ్మదిగా నాకన్యను బర్వతునిఁజేర్చునట్లుచేసెను.
కామాతురుఁడైన పర్వతుఁడాకన్యను స్వీకరించి విషప్రయోగ
మున మృతుఁడయ్యెను. చాణక్యుని మాయవలనఁ జంద్రగు
ప్తుని ప్రాణములు దక్కుటయేగాక, నందరాజ్యములో నర్ధ
భాగము గైకొనుపద్ధతిని సహాయముజేయవచ్చిన పర్వతుఁడు
కూడ మడిసెను. భాగురాయణుఁడను సేనాపతి, చంద్రగుప్తుని
పరమునఁ బర్వతుని పుత్త్రుఁడగు మలయకేతువును జేరెను.

నందులు సంహరింపబడిరి. మగధరాజ్యములో నర్ధ
భాగమాసించివచ్చిన పర్వతుఁడు మడిసెను. మలయకేతువు

భీతిల్లి తనరాజ్యముఁ జేరుకొనెను. అప్పుడు చాణక్య చంద్రగుప్తులు పాటలీపుత్త్రమును బ్రవేశించిరి. రాక్షసుఁడంతల కభ్యంతరముగలిగింపఁ దనబలములఁ జంద్రగుప్తునిబలములపైఁ బురికొల్పెను. నందులందఱును మరణించిరిగాని వారి తండ్రియగు మహాపద్మనందుఁడు మాత్రము జీవించియుండుటచే, నెట్లైన నొకబాలునిఁ దెచ్చి, వానిని దత్తతఁ జేయించి వంశము నిలుపవచ్చునని రాక్షసుఁ డామహాపద్మనందుని నొకవనమున దాగియుండుటకు రహస్యముగాఁ బంపివేసెను.

పాటలీపుత్త్రమున రాక్షసునకు మిత్త్రుడైన చందనదాసుఁడను వాఁడొకఁడుండెను. రాక్షసుఁడు తన యాలుబిడ్డల నాచందనదాసుగృహంబునయుంచి, నంద పక్షపాతులగు కొందఱిని—నెట్లయినఁ జంద్రగుప్తుని వధించుటకు నియమించి, యతఁడుగూడ ననేకయత్నములు సేయుచుండెను. మహాపద్మనందుఁడు వనంబుననున్న సంగతి నెట్లోవిని ఘాతుకులఁ బంపి, చాణక్యుఁడాతనిని జంపించెను. రాక్షసుఁడదివిని, తానింకఁ బాటలీపుత్త్రముననుండుట మోసమనితలంచి, రహస్యముగాఁ బర్వతరాజపుత్త్రుఁడగు మలయకేతువుఁ జేరి, యాతనితండ్రిని జంపిన చంద్రగుప్తచాణక్యులపైఁ బగఁదీర్చుకొనుమనిబోధించి, వారిపై దాడివెడలుటకు సమ్మతింపఁ జేసెను. ఇదియంతయుఁ జాణక్యుఁడు గూఢచారులవలన వినుచు మలయకేతువునకును, రాక్షసునకును వైరముఁ గల్పింపఁదలఁచి యింతకుమున్నాతని పంపున జీవసిద్ధియనుపేర క్షపణకవేషమున నందులఁగొలిచి, యిప్పుడిచ్చటనున్న యిందుశర్మను, రాక్షసునిపంపున విష

కన్యను బర్వతరాజుకడకుఁ జేర్చితివను నేరము మోపి నగరము వెడలనడచెను. ఈ కారణమున నిందుశర్మ మలయకేతువుం జేరిన రాక్షసుని మరలఁ జేరుటకు వీలుగలిగెను. చాణక్యుని యుపాయమువలనను, జీవసిద్ధి యిచ్చటఁ జేరి పన్నినతంత్రము వలనను, విషకన్యను బర్వతరాజునొద్దకుఁ బంపినది రాక్షసుఁడే యని జనులు చెప్పుకొనసాగిరి.

పాటలీపుత్రమున నందపక్షపాతులెవ్వరో వారెక్కడ నుండిరో, యాయుదంతమంతయుఁ జాణక్యుఁడు గూఢచారుల వలన వినుచుండెను. చందనదాసునిగృహమున రాక్షసుని భార్యాపుత్రులుండిరని యాతనికిఁ దెలిసెను. ఇంతియేగాక, అతఁడు రాక్షసునిముద్రిక నొకదాని నెట్లో సంపాదించి, దాని మూలమునఁ గొన్ని యుత్తరములసృష్టించి, మలయకేతు రాక్షసులకు విరోధముగల్పించెను. ఇట్లు రాక్షసుఁడు పన్నుచున్న వ్యూహములకుఁ జాణక్యుఁడు ప్రతివ్యూహములఁ బన్నుచు నిరంతరము జంద్రగుప్తుని రక్షించుచుండెను. నందవంశసంహారమొనర్చిన చాణక్య చంద్రగుప్తుల నెట్లయిన వధింపవలయునను పట్టుదల రాక్షసుఁడు విడువలేదు. అతనిని దనవశముఁ జేసికొనుటకుఁ జాణక్యుఁడెన్నియో తంత్రములఁ బన్నుచుండెను. ఎంతయో యాశపెట్టెను. ప్రభుభక్తిపరాయణుఁడగు రాక్షసుఁడందులకునంగీకరింపలేదు. తుదకుఁ జాణక్యుఁడు చందనదాసుగృహముననున్న రాక్షసుని భార్యాపుత్రులను దనవశము చేయుమని బలవంతపఱచెను. చందనదాసుఁడందులకంగీకరింపక పోవుటచే నాతని నురిదీయఁదలఁ

చిన. ఈవార్త రాక్షసుండువిని, తనమూలమున మిత్రుఁడగు చందనదాసు చంపబడుట ధర్మముకాదనియెంచి, విధిలేక చాణక్యునకులోఁబడి, యాతని వాక్యములననుసరించి చంద్రగుప్తునకు మంత్రిగానుండుటకు సమ్మతించెను. ఇట్లు చంద్రగుప్తుఁడు చాణక్యునిసహాయమున మగధరాజ్యసింహాసనమధిష్ఠించి, పరాక్రమవంతుఁడై, ధర్మమూర్తియై తనరాజ్యమును భరతఖండమునందంతటను వ్యాపింపఁ జేసెను.

### అలెగ్జాండరు దండయాత్ర:—
### చంద్రగుప్తుఁడు శెల్యూకస్ను జయించుట:—

గ్రీసుదేశమునం దనసామ్రాజ్యము స్థిరపఱచుకొన్న యలెగ్జాండరను నొకవీరుఁడు పెక్కుదేశముల జయించి, తరువాత హిందూదేశముమీఁదకు దండెత్తివచ్చెను. ఈతఁడు మూఁడుసంవత్సరములకాలము పంజాబు సింధుదేశములయందుండి, యనేక చిన్నరాజ్యములను జయించెను. ఈతనికనేకమంది రాజులు వశులైరి. పురుసోత్తముఁడను నొకరాజీతనితోఁ బ్రబలముగఁబోరాడెను, గాని హిందూరాజులు కొందఱు దేశద్రోహులై యలెగ్జాండరునకు సహాయమొనర్చుటచేఁ బురుషోత్తముఁడోడిపోయెను. ఈయలెగ్జాండరునకు హిందూదేశమంతయు జయింపవలయునను కోరికయుండెను. కాని, యాతనిసేనలు మిగుల నలసియుండుటచే "బియాస్" నదిదాఁటుటకు నిరాకరించి తిరుగబడుటచే నతఁడు జయించిన

ప్రదేశములందుఁ గొంతకొంతసైన్యమునుంచి తన దేశమున కరిగెను. అలెగ్జాండరు వెడలినతరువాతఁ జంద్రగుప్తుఁడాప్రదేశములన్నియు నాక్రమించుకొనఁదలఁచి, విశేషసైన్యమును గూర్చుకొని, దండువెడలి, గ్రీకుల వెడలనడిచి, యుత్తరహిందూస్థానమునందలి రాజ్యములగెలిచి, యార్యావర్తమునకంతటికిని బ్రసిద్ధచక్రవర్తియయ్యెను. పంజాబునుండి చంద్రగుప్తునిచే వెడలఁగొట్టఁబడిన గ్రీకులలో శెల్యూకస్సనువాఁడొకఁడుండెను. ఈతఁడు అలెగ్జాండరుయొద్దనున్న సేనాధీశ్వరులలో ముఖ్యుఁడు. అలెగ్జాండరు గతించినపిమ్మట నీతఁడు కొందఱు సేనానులతోఁ బోరి, యాసియాఖండములోఁ బశ్చిమ మధ్యభాగమునకు రాజై, గ్రీకుపతాకమును మరల పంజాబులో నిలుపఁదలఁచి, కొన్ని సేనలఁ గూర్చుకొని చంద్రగుప్తునిపై కెత్తివచ్చెను. చాణక్యుని తంత్రమువలనఁ జంద్రగుప్తుఁ డతి చాతుర్యముతో సెల్యూకసు సేనలను ముట్టడించెను. సెల్యూకస్ చంద్రగుప్తునితో నతిఘోరముగఁ బోరి, తుద కాతని శరణుబొంది తన కూతురు నాతని కిచ్చెను. సెల్యూకస్ చంద్రగుప్తుని యాస్థానమున "మెగాస్తనీస్" అను నొక రాయబారి నుంచెను. "మెగస్తనీస్" చంద్రగుప్తుని పరిపాలనమును గూర్చి విశేషముగ వ్రాసెను.

చాణక్య మంత్రాలోచనమున వన్నెకెక్కి రాజ్యాధిపుఁడైన చంద్రగుప్తుఁడు, రాజ్యపరిపాలనమున ననేకనూతనపద్ధతుల నేర్పఱచెను. ఈతఁడు సేనలు నడుపుటయందున, శత్రుదుర్గములు ముట్టడించుటయందును, నతి నిపుణతఁ

మెలంగుచుండును. బలములను సంపూర్తిగ వృద్ధి పఱచెను. గ్రామపంచాయతుల నిర్మించెను. శిల్పముల వృద్ధిపఱచెను. తన రాష్ట్రమున జననమరణముల లెఖ్ఖలనుంచెను. చేతి పనుల నభివృద్ధిజేసెను. అరణ్యముల ఛేదించి బాటలువేయించెను. నదులపై వంతెనలు గట్టించెను. కాలువలు, చెరువులు త్రవ్వించెను. వేయేల! జనుల సౌకర్యమును జూచుచు భరత ఖండ ప్రథమచక్రవర్తియగు నీ చంద్రగుప్తుఁ డిరువదినాలుగు సంవత్సరములు రాజ్యపరిపాలనముఁ జేసెను.



# 2. పృథివీరాజు.

పండ్రెండవ శతాబ్దమున భరతఖండము మహదైశ్వర్యముతోఁ దులదూగుచున్నప్పుడు, ఢిల్లీ, అజమీరు, కన్యాకుబ్జము, చిత్తూరు, అబూగడము, అనిహిలపురము సను సంస్థానములు స్వాతంత్ర్యశోషహించి మహోన్నతదశయందుండెను. ఢిల్లీ రాజ్యము ననంగపాలుఁడును, నజమీరు రాష్ట్రము బృథిరాజునుఁ గన్యాకుబ్జము జయచంద్రుఁడును, చిత్తూరుసంస్థానము సమరసింహుఁడును, నబూగడము జైతుఁడును, ననిహిలపురమును భోలాభీముఁడును నిరంకుశముగ నేలుచుండిరి. స్వతంత్రులయిన వీరందఱును నన్యోన్యమైత్రిచే విరాజిల్లుచుండిరేని, పరుల దండయాత్రలవలన భయములేక భారతసామ్రాజ్యలక్ష్మి చలింపకయేయుండును. కాని భారతభూమి యట్టి పుణ్యమును జేసికొనియుండలేదు. ఈ సంస్థానాధీశ్వరులొకరిని జూచిన నొకరోర్వలేకయుండిరి. వారియసూయ క్రమక్రమముగా వృద్ధియై యంతఃకలహములుగామాఱెను. ఈయంతఃకలహములు భారతదేశౌన్నత్యమునకు భంగమని వారికిఁదోచలేదు. వీరందఱును తమరాష్ట్రములపై నిరంకుశాధికారులగుటయేగాక పరస్పరబాంధవ్యమునుఁగూడఁ గలిగియుండిరి.

ఇందు ఢిల్లీశ్వరుఁడగు ననంగపాలునకుఁ బుత్రసంతానములేదు. ఇద్దఱు కుమార్తెలుమాత్రముండిరి. జ్యేష్ఠపుత్రికను నజమీరురాజయిన సోమేశ్వరునకును, రెండవ[illegible]మును కన్యాకుబ్జనగరాధీశుఁడైన విజయపాలున[illegible]గెను.

పృథివిరాజు అనంగపాలుని పెద్దకూతురుకొడుకు. రెండవ కుమార్తెకుదయించినవాఁడు జయచంద్రుఁడు. అనంగపాలుఁడు వృద్ధుఁడును పుత్రసంతానములేనివాఁడును నగుటచే నాతని వంశస్థానమునకాయిరువురు మనుమలుగూడ హక్కుదారులే. కాని యనంగపాలుని నిజాభిప్రాయము మాత్రమెట్టిదో యెవ్వరు నెఱుంగరు. అతఁడెవ్వరిసలహానుగూడఁ బొందియుండినట్లు తోఁచదు. అతఁడు తన ఢిల్లీరాజ్యమునకుఁ బృథ్వీరాజునభిషిక్తు నిఁజేసి భగవద్ధ్యానమునఁ గాలము గడుపుటకు వనంబును జొచ్చెను.

ఈ పట్టాభిషేకమహోత్సవము జయచంద్రుని హృదయమునఁ గ్రోధాగ్ని రగులుగొల్పెను. దౌహిత్రులిరువురకును ఢిల్లీరాజ్యము సమానముగ విభజింపఁబడవలసినదే కాని యట్లు జరుగలేదు. నూతన ఢిల్లీరాజ్యసింహపీఠమధిష్ఠించిన పృథ్వీరాజుపైఁ గోపమువహించి, జయచంద్రుఁడాపగను దీర్చుకొనుటకై యత్నించుచుండెను. జయచంద్రుని యుద్యమము నెఱింగి, పృథ్వీరాజుగూడ నాతనిపైఁ గోపభావమునే వహించియుండెను. ఈయిరువురి క్రోధమువలనను, భారతభూమిపై నెట్లు రక్తనదులు ప్రవహించెనో, యెట్టి రాజవంశములు నశించెనో, మనమెఱుఁగఁగలము. పృథివీశ్వరునిపైఁ బగదీర్చుకొనుటకు జయచంద్రుఁడు వలసిన సమరప్రయత్నములన్నియుఁ జేయుచుండెను. పృథ్వీరాజు మాత్ర మీవిషయమున నంతఁ శ్రద్ధఁదీసికొన్నట్లు తోఁచదు.

ఈయన్నదమ్ములిరువురును నిట్టస్థితిలోనుండిరి. ఈసమ
యమున నబూగడమున కధిపతియైన జైతుఁడు తనకుమార్తె
యగు నిచ్ఛనీకుమారికిఁ బరిణయము సేయఁదలంచి వరాన్వేష
ణము జేయుచుండెను. అప్పటిలో బలాఢ్యుఁడును, రెండురాజ్య
ముల కధీశుఁడునునగు పృథివీశునకా కన్యనిచ్చుట కాతఁడు
నిశ్చయించెను. ఈతని యభిప్రాయమెఱింగెనో లేదో కాని
యనిహిలనగరాధిపతియగు భోలాభీముఁడిచ్ఛనీకుమారినీఁదన
కిచ్చి పరిణయము సేయవలసినదని జైతునకు వార్తబంపెను.
ఆవార్తవిని జైతుఁడు తనపుత్రికకిదివఱకే వరుని నిశ్చయించితి
నని ప్రత్యుత్తరమంపెను. తనమాటఁ ద్రోసివేసినందులకు
భోలాభీముఁ డాగ్రహమునంది, జైతునిపై యుద్ధమునకు
వెడలఁ దలఁచెను. ఈవిషయము జైతుఁడు విని పృథ్వీశ్వరున
కెఱుంగఁజేసి, సత్వరముగ నరుదెంచి, యిచ్ఛనీకుమారిని
గ్రహింపుమని వార్తఁబంపెను. ఇంతకుముందే ఇచ్ఛనీకుమారి
సౌందర్యమునుగూర్చి వినియుండి, యామెనెట్లు వివాహమాడ
గలుగుదునాయని పరిపరివిధములఁ దలంచుచున్న పృథ్వీరా
జునకు జైతుని వర్తమానము, వెదుకబోయిన తీగె పదము
లకుఁ దగిలినట్లయ్యెను. కాని, కన్యకను గైకొను సంతోషము
మాత్రము బయలుపఱచక, జైతునకు సహాయము సేయువాని
వలె నటించుచు, నఖండసేనాసమేతుఁడై వెడలెను. ఇట
యంతయు భీముఁ డాలించి తన కోరిక నిరాకరించిన జైతుని
నోడించి కన్యను జేకొనవలయుననియుఁ,గన్యను జేకొనదలంచి
జైతుని పక్షము వహించిన పృథ్వీరాజునకు సంపూర్ణపరాభ

వము సేయవచ్చుననియుఁదలంచి, చతురంగబలములతో వచ్చి నబూగడమును ముట్టడించెను. ఇరుతెగలవారికిని పోరతి ఘోరముగ జరిగినది. పృధ్వీశ్వరునిచే నడపఁబడుచున్న ఢిల్లీ యజమీరుసైనికులు రణరంగమునఁ దమ ప్రాణములనైన నటికుఁ గొనక వీరవిక్రమవిహారము సలిపిరి. బోలాభీముని సైన్యముగూడ నట్టే పనిఁజేసెను కాని దైవము పరాఙ్ముఖుఁడై యుంటచే నాతని సైన్యము వెన్నిచ్చెను. బోలాభీముఁడును నిఁక రణమున నిలిచినచో మాట దక్కదని తలంచి పలాయితుఁడయ్యెను. జైతుఁడు సంతోషించుచు విజయలక్ష్మీలాలితుఁడైన పృధ్వీరాజున కిచ్చునీకుమారినిచ్చి యతివైభవముతోఁ బెండ్లిఁజేసెను.

అప్పటికి బోలాభీముఁడు పారిపోయెను గాని పృధ్వీరాజ జైతులను గెలుచుటకుఁ బ్రయత్నములు సేయుచునే యుండెను. ఇంతకుమున్న జరిగిన యుద్ధమునుగూర్చి కన్యాకుబ్జనగరాధీశుఁడైన జయచంద్రుఁడు వినెను. అతని హృదయమునఁ బృధ్వీశ్వరునిపై మఱింత యసూయపెరిగెను. ఇంతకుముందే యాతనిపైఁ బగఁదీర్చుకొనఁ దలంచుచున్న యాతఁడిఁక నుపేక్షవహింపరాదని నిశ్చయించుకొని బోలాభీమునితో మైత్రిఁజేసికొనుటకుఁ దలంచుచుండెను. భీముఁడును జయచంద్రుని యుద్యమమెఱింగి యాతనితోఁ గలియుటకుఁ బ్రయత్నించుచుండెను. వీరియిరువురును ద్వరలోనే మిత్రులయిరి. ఈసందర్భమున నింకొకటి చెప్పవలసియున్నది. "అస్పృష్టవంతునిఁ జెలియువారలే' రను సామెత యందఱు నెఱింగి

నదే. నాగపురమునకు సమీపముననున్న ఖజురాపురమునఁ బృథ్వీశ్వరునకు భర్తృపితృమైన కొంత ధనము దొరకెను. ఈ విషయమున చందేలురాజునకును, బృథ్వీరాజునకును యుద్ధము ప్రాసఁగెను. అందులోఁ బృథ్వీశ్వరుఁడు సంపూర్ణముగు విజయమును గాంచెను. ఈవిజయము భీమ జయచంద్రుల హృదయమును మఱింత కలరవఁ బెట్టెను. ఇఁకఁ బృథ్వీరాజు విషయమై యూరకున్నచో నాతని బలము మఱింత హెచ్చిపోవునని తలంచి వారు గట్టిప్రయత్నముల సేయసాగిరి. జయచంద్ర భీములిరువురు గలిసినను, బృథ్వీశ్వరుని గెలువఁగలుగుదుమా లేమా యను సంశయము గలిగెను. అందులకై వారితరుల సహాయ మపేక్షింపవలసిన వారైరి. ఎవరో యొకరిద్దఱుతప్ప భారతదేశ ప్రభువులెవ్వరును పృథ్వీరాజుపై గత్తిఁ గట్టుటకు సమ్మతింపకైరి. రాజులందఱును పృథ్వీరాజు బలపరాక్రమము లెఱింగియేయున్నారు. అందుచే జయచంద్రుఁడు పరుల సహాయమును గోరవలసివచ్చెను.

హిమవత్పర్వతమునకవ్వల తుర్కస్థానమున్నది. అందు గజనీపట్టణము గ్యాసుద్దీన్, శహాబుద్దీన్ గోరీ యను నిరువురు సోదరులచేఁ బరిపాలింపఁబడుచుండెను. భీమ జయచంద్రులు పృథ్వీరాజు విషయమై యెఱింగించి యాతురుష్కుల సహాయ మపేక్షించిరి.

అది యేమిపాపమోగాని భారతదేశమహదైశ్వర్యముఁ జూచిన నన్యదేశీయులకుఁ గన్ను కుట్టుచుండును. భారతదేశము సమస్తములగు పాడిపంటలతోను, [illegible]

కోసు పొంచుచున్నదని యింతకుమున్నే శహాబుద్దీన్ గోరీ విని యుండెను, ఎప్పుడు భారతదేశముపైఁ బడి యగాధైశ్వర్యలక్ష్మిని జూరఁగొందునా యని సమయమునకై వేచియుండెను. భీమ జయచంద్రులు పంపినవార్త విని శహాబుద్దీన్ గోరీ మహానంద పరవశుఁడై, యూతగామున నే సైన్యసమేతముగా వారికి సహాయము సేయుటకు వచ్చెను. భారతజాతియంతయు మహా మ్మదీయుని భారతవర్షముపై దండెత్తఁ జేసినందులకు మిగుల దూషించెను. ఆహా! నరములయందార్యరక్తము ప్రవహించు చున్న ప్రతిభారతపుత్రుఁడు నిట్టి యకార్యము భారతదేశా స్వాతంత్ర్యమునకు నాశనకారణమనియు, భీమజయచంద్రులు త్వర లోనె మసియుదురనియుఁ దలంచిరి. భీమజయచంద్రులు గోరీ సహాయమున గర్వించి పృథ్వీరాజుపైఁ గత్తిగట్టిరి.

భారతసంతానముగా జనించిన వీరంతఃకలహములఁ బెంచుకొని, పరదేశస్థుఁడగు గోరీ సహాయము నపేక్షించి తెచ్చి నందులకు, ఆర్యావర్తరాష్ట్రముఁ బరిపాలించుచున్నవాఁడును, పృథ్వీరాజునకు గానమఱఁదియునగు సమరసింహుఁడు, వారికి సంపూర్ణపరాభవము గలుగఁజేయవలయునని, తన సైన్య ముతోవచ్చి పృథ్వీరాజుపక్షమునఁ జేరెను. ఇరుతెగలవారి కిని ఘోరమైన యుద్ధము జరిగెను. పృథ్వీరాజుచే భీమజయ చంద్రులు సంపూర్తిగ నోడింపఁబడిరి. భారతైశ్వర్యముపై నాసఁ బెట్టుకొనివచ్చిన గోరీ పృథ్వీరాజుచేఁ బట్టుకొనఁబడి ఢిల్లీకిఁ గొనిపోవఁబడెను. పృథ్వీరాజు ఢిల్లీకిఁ జేరి విజయసూచనార్థమై మహోత్సవముగావించి యాస్థానోద్యోగులను—గౌరవించు

బ్రాహ్మణులను ననేకవిధముల సన్మానించెను.

పృథ్వీశ్వరునిచేఁ జెఱఁబెట్టఁబడిన శహాబుద్దీన్ గోరీ యొకనాఁడు పృథ్వీశ్వరునకు "నీపరాక్రమమెఱుంగక భీమ జయచంద్రులు గోరఁగా వారిపక్షమున వచ్చి నీతోఁ బోరి మహాపరాధము జేసినాఁడను. క్షమించి నన్ను విడిచిపుచ్చు" మని ప్రార్థించుచు వాక్రుచ్చెను. శరణాగతత్రాణబిరుదాంకితుఁడగు పృథ్వీరాజు గోరీని దనసముఖమునకు రావించి, సంభాషించి విడిచిపెట్టెను. పంజరమునుండి విడిచిపెట్టఁబడిన చిలుకవలెఁ బ్రాణములు దక్కెనని సంతసించుచు, గోరీ తన రాజ్యమును జేరెను. కాని యెట్లయినను బృథ్వీరాజుని జయించి భారతదేశైశ్వర్యమును హరించవలయునను కోరిక మాత్రము విడువలేదు. భరతఖండమున మహమ్మదీయ సామ్రాజ్యము స్థాపింపవలయునని యాతఁడు పట్టుదలఁ బూని యుండెను. ఈయుద్దేశముచేత నాతఁడు సేనాసమేతుఁడై మరల నాలుగుసారులు దండెత్తివచ్చెను. ఈదండయాత్రల యందుఁగూడ బృథ్వీరాజుచే నాతఁడు పట్టుకొనఁబడి విడిచి పెట్టఁబడెను. ఇన్నిసారులు శత్రువునిఁ బట్టుకొని విడిచిపెట్టిన పృథ్వీరాజుయొక్క యుదారగుణము నెంతయు శ్లాఘింపవలయును.

ఇన్ని పర్యాయములు గోరీ యోడిపోవుటఁజూచి భీమ జయచంద్రులకుఁ బృథ్వీరాజువిషయమై మార్గమేమియుఁ దోచక కొన్నాళ్లు సమరప్రయత్నము మానియుండిరి. ఇంతలో జయచంద్రుఁడు చక్రవర్తి బిరుదంబుఁగాంచి, పృథ్వీరా

కంటె నధికుఁడని పిలిపించుకొనఁబడుటకు రాజసూయ మహా
ధ్వరము సేయనాశించి, బంధుమిత్రుల నాహ్వానించెను. ఆస
మయముననే తనకూతురగు సంయుక్తకు స్వయంవరము
గూడఁ దలపెట్టెను. మఖోత్సవ సందర్శనార్థమై యనేకులు
వచ్చిరి. జయచంద్రుఁడు యాగదీక్షితుఁడై యుండెను. ఈసం
దర్భమున నాతని యధ్వరమునకు భంగము సేయఁదలచి,
పృథ్వీరాజు ఆతని బంధువులలో నొక్కనిఁజంపెనని చెప్పు
దురు. ఇది యెంతవఱకు సత్యమో తెలియదు. ఏమైననేమి?
జయచంద్రుని యాగమున కంతరాయమొదవెను. యాగము
నకు భంగము సంభవించినను జయచంద్రుఁడు సంయుక్తా
స్వయంవర ప్రయత్నములు మాత్రము మానలేదు. స్వయం
వర మహోత్సవము మఱియొక ముహూర్తమున జరుగునని
చాటఁబంచెను.

స్వయంవరదినము సమీపించెను. సంయుక్తను వివాహ
మాడఁదలఁచి రాజులు పెక్కండ్రు వచ్చిరి. జయచంద్రుఁడు
రాజుల నందఱను బిలిచెనుగాని పృథ్వీరాజునుమాత్రము పిలు
వలేదు. ఈసందర్భమున జయచంద్రుఁడు తనకుఁ బృథ్వీరా
జుపైనున్న పగ యింతమాత్రమున దీరుననియో లేక పరాభ
వము సేయఁదలఁచియో, పృథ్వీరాజుయొక్క ప్రతిమ నొక
దానిని జేయించి, స్వయంవరమందిరద్వారమున నుంచెను.
వీరాగ్రేసరుఁడును, ఢిల్లీసామ్రాజ్యపరిపాలకుఁడును నగు పృథ్వీ
రాజు తన ద్వారపాలకునితో సమానుఁడని తెలుపు[illegible]
గాఁబోలు నాతఁడట్లొనర్చెను. ఇట్లు సేయుటకు [illegible]

మేమని స్వయంవరార్థమైవచ్చిన రాజులెవ్వరును ప్రశ్నింప
లేదు. శుభలగ్నము సమీపించినయంతటనే సంయుక్త సఖీ
జనపరివృతయై స్వయంవరమందిరమున కరుదెంచెను. జయ
చంద్రుని యాజ్ఞ ననుసరించి చెలికత్తెలు సంయుక్తకు స్వయం
వరమునకువచ్చిన రాజులను వేర్వేరుగ నెఱింగించిరి. అం
దఱిమీఁదను సంయుక్త తన దృష్టి నిలుపలేదు. ఆమె నెమ్మ
దిగా ముందుకుఁబోయి పృథ్వీరాజు ప్రతిమయొక్క గళంబును
పుష్పహారముచే నలంకరించెను. ఆమె యీపనిఁ జేసినప్పుడు
జయచంద్రుని హృదయమెట్లయ్యెనో చెప్ప నలవికాదు. తీరని
పరాభవము కలిగెనని దురాగ్రహావేశుఁడై "ఆమెను చెఱలోఁ
బడవేయుఁ"డని పలికి జయచంద్రుఁడులోనికిఁబోయెను. స్వయం
వరాగతులరుదెంచిన రాజులెల్లరును భగ్నమనోరథులై చనిరి.
సంయుక్త వ్యగ్రచిత్తయై యంతఃపురమునకుఁబోయెను.
ఆమెను పలువురు పలువిధముల దూషించిరి. తల్లిగూడఁ
దిట్టెను. ఎవరెన్నిపలికినను సంయుక్త నిరుత్తరయైయుండెను.
అంతలో నక్కడకు జయచంద్రుఁడు మండిపడుచువచ్చి సంయు
క్తను జీవాట్లుపెట్టి యనేకవిధముల బెదరించెను. తుద కాతఁ
డామెను కారాగృహమున బంధించెను.

అక్కడఁ బృథ్వీరాజెట్లుండెనో చూతము. జయచం
ద్రుఁడు స్వయంవరసమయమునఁ దన్నవమానించుటకుఁ జేసిన
యకృత్యమును, వందులకు సంయుక్తచేసిన మహాకార్య
మును నాతఁడు వినెను. తనయెడల నట్టి ప్రేమనుజూపి, గౌర
వము గాపాడిన సంయుక్తను రక్షించుట విధియైయున్నదని

యూతఁడు తలంచి, సేనాసమేతుఁడై కన్యాకుబ్జనగరసమీప మునకువచ్చి విడిసెను.

జయచంద్రుఁడు పృథ్వీరాజు రాకను విని సైన్యములను సిద్ధముజేసి కహారకంఠీరవుఁడనువాని నధిపతిగాఁజేసి, పృథ్వీ రాజు సైన్యముతోఁ బోరుటకు నియమించెను. ఉభయపక్ష ములవారును నాటిరాత్రి సంపూర్ణమైన సమరప్రయత్నము లఁ జేసికొనుచునే యుండిరి. పృథ్వీరాజు రాక కారాగృహ మునను న్న సంయుక్తకుఁ దెలిసెను. ఆమెపొందిన యానంద మునకు మేరలేదు. అనాటిరాత్రి యామె కారాగారమునుండి యెట్లు తప్పించుకొనెనో చెప్పఁజాలము. ఆమెయు, నిరువురు చెలికత్తెలును పురుషవేషముల ధరించి, జయచంద్రుని సైన్య ములఁ బరీక్షసేయువారివలె నిటునటుఁ గొంతసేపుతిరిగి, నెమ్మ దిగా నీవలఁబడి, పృథ్వీరాజు విడిచియున్న ప్రదేశమునకువచ్చి చేరిరి. సంయుక్త—పురుషవేషముననున్న చెలికత్తెలను తనరాకఁ బృథ్వీశ్వరునకెఱింగించెను. పృథ్వీశ్వరుఁడామె రాకకు మిగుల సంతసించి, ధైర్యమునకు మెచ్చుకొని గాంధర్వ విధిని గైకొనెను.

సంయుక్తా పృథ్వీరాజుల పరిణయమెట్లు జరిగెనో చెప్పఁ జాలము. ఇట్టి వివాహమున కార్యసంతతి యుం దెవ్వరును నంగీ కరింపరు. పృథ్వీరాజును—జయచంద్రుఁడును నక్కచెల్లెండ్ర పుత్త్రులని మనమెఱింగినవిషయమే. అందుచే సంయుక్త పృథ్వీశ్వరునకుఁ గూఁతురగును. భారత ధర్మశాస్త్రమునందీ వివాహమును గూర్చి యొచ్చటను జెప్పఁబడియుండలేదు

సంయుక్త చెఱనుండి తప్పించుకొని పృథ్వీరాజును
చేరినసువార్త, మఱునాఁడుదయమున జయచంద్రునకుఁ దెలి
సెను. కహారకంఠీరవాధిపత్యమున జయచంద్రుని సైన్యమును,
"అతతాయి" యనువాని యాధిపత్యమునఁ బృథ్వీరాజు సైన్య
మును విలసిల్లుచుండెను. ఉభయబలంబులును రణంబునకుఁ
దలపడెను. కొంతసేపటికి "అతతాయి" కహారకంఠీరవునిచేఁ
గూలుటంజేసి, పృథ్వీరాజుసైన్యము కొంచెము వెనుదీసెను.
ఈవార్తవిని పృథ్వీశ్వరుఁడు సంయుక్తతో గుడారములో జాగ
రూకతతో నుండుమని చెప్పి, రణరంగమున కుఱికెను. ఏలికయే
స్వయముగ సంగ్రామభారము బూనినప్పుడు, సైన్యము
యొక్క యుత్సాహమునకు మితియుండదుకదా! ఢిల్లీశ్వరుని
సైన్యము కన్యాకుబ్జసైన్యముపై విజృంభించి గవిసెను. కహార
కంఠీరవుఁడు పృథ్వీరాజుం దాఁకి పోరాడుచు ఖడ్గమువిసరనున్న
సమయమున నెక్కడనుండియో యొకవీరుఁడువచ్చి, కహార
కంఠీరవుని యమసదనమునకుఁ బంపి, కన్యాకుబ్జసేనపైఁబడి
వీరవిహారము సల్పఁదొడంగెను. ఆవీరుఁడెవ్వఁడో పృథ్వీశ్వ
రుఁడు గుర్తింపలేకయుండెను. నూతనవీరుని పరాక్రమ విజృం
భణమునకును, బృథ్వీరాజు శౌర్యమునకును దాళఁజాలక జయ
చంద్రుని సేనలు వెన్నిచ్చెను. పాఱిపోవుసైన్యములను దుమా
ఱుట ధర్మముగాదని నూతనవీరుఁడు తెలుపుటచేఁ బృథ్వీరాజు
సమరముఁ జాలించి, యాతనిని వెంటఁబెట్టుకొని శిబిరమున కరి
గెను. నూతనవీరుఁడు సంయుక్తయని యిప్పుడాతనికిఁ దెలి
సెను. అప్పుడాతఁడు సమ్మోదమంది సంయుక్తనుజూచి "సం

యుక్తా! నీధైర్యసాహసముల కెంతయు మెచ్చవచ్చును. నాడు స్వయంవర సమయమున నీతండ్రి నాకొనర్చిన యగౌరవము నకుఁ దగిన ప్రతీకారముఁ జేసి నాగౌరవము నిలిపితివి. నేఁడు భీకరసంగ్రామమునఁ గహరకడితీరవుని ఖడ్గప్రహారమునఁ జావకుండ రక్షించితి" వని పలికెను.

జయచంద్రుని సైన్యమునకు సంపూర్ణముగు నోటమి సంభవించెను. అతఁడు మరల ఢిల్లీశునిపైకి సైన్యమును బంపఁ గలఁచుకొనలేదు. పృథివీరాజు సంయుక్తాసహితుడై నిజనగర మున కరిగెను.

పరాభవము కలిగిన జయచంద్రుని సంతాపమునకు మేరలేకయుండెను. "పృథ్వీరాజైన నుండవలెను. లేక నేనైన నుండవలె" నని యాతఁడు పట్టుదలఁబూనెను. అతఁడీవార్త లోలాభీమున కెఱుంగఁజేసి, యాతని యనుమతిని బృథ్వీరాజ వినాశమునకు మరలఁ బ్రయత్నము సేయుచుండెను.

సంయుక్తతో ఢిల్లీ ప్రవేశించిననాఁటనుండియుఁ బృథ్వీ రాజు భోగపరాయణుఁడై వర్తించుచు రాజకార్యముల నే మఱచియుండెను. పరరాజు లెత్తివత్తురను భయముగూడ నాతనికి లేకయుండెను. ఇంతవఱకును గోరీతోఁగాని, జయ చంద్రునితోఁగాని, తదితరప్రదేశములయందుఁగాని జరి గిన దారుణరణములందుఁ బెక్కండ్రు యోధాగ్రేసరులు మడి సిరి. అయినను నిప్పటికిని—కమాస్‌మంత్రియు, చాముండరా యకును, హాహూలీరాయకును నుండిరి. కాని పీరివిషయము పృథ్వీశ్వరుఁడు వ్యతిరేకముగా వర్తించెను.

కమాస్:— పృథ్వీరాజు విజయములన్నిఁటికిని నీతఁడే కారణు డని చెప్పవచ్చును. ఇతఁడు రాజ్యతంత్రజ్ఞఁడై యుండుటయేగాక రణకోవిదుఁడుగూడనై యుండెను. వేయేల? ఢిల్లీశ్వరుకు కీతఁడు కుడిచేయిగానుండెనని చెప్పవచ్చును. అట్టి యీతనిని, పృథ్వీశ్వరుడు తన భోగకాంతను గోరెనని చంపించెను.

చాముండరాయడు:— ఇతఁడు ప్రతివిషయమునందును కమాస్‌తోఁ బోల్పఁదగినవాఁడు. ఒకయేనుగును జంపినాడని రాజీతనిని గారాగృహంబునందుంచెను. అప్పు డీతఁడగ్నిసన్న్యాసము చేసెను.

హాహూలీరాయఁడు:— ఇతఁడు సైన్యాధీశుఁడు. భోగవరాయణుఁడైన రాజే కారణముచేతనో నిండుసభలో నీతనిని బరాభవించెను. ఇతని క్రోధమే ఢిల్లీరాజ్యవినాశమునకుఁ గారణమయ్యెను.

రాజుచేఁ బరాభవింపఁబడిన హాహూలీరాయఁడు పృథ్వీశ్వరుని విషయమై ప్రతినవహించి గోరీతో సంభాషింపుటకు గజనీపట్టణమున కరిగెను. ఈసమయమునకు జయచంద్రు లీములు చేయుచున్న యుద్ధప్రయత్నములు గూడ ముగిసినవి. కమాషువధింపఁబడుటయు, చాముండరాయని యగ్నిసన్న్యాసము, హాహూలీరాయడు గజనీపట్టణమునకుఁ బోవుటయు వారువినిరి. ఇవియన్నియుఁ దమయుద్యమమున కనుకూలముగ నున్నవని సంతసించి, వెంటనే గోరీకి పృథ్వీశ్వరునిపైకి యుద్ధమునకురమ్మని వార్తఁబంపిరి. అంతకుముందే

పృథ్వీరాజుచేఁ బరాభవింపఁబడిన హాహూలీరాయఁడు గోరీకిఁ
జెప్పఁగలసినదంతయుఁ జెప్పెను. ఇఁక ఢిల్లీసింహాసనము తనకు
దక్కినట్లుగనే సంతసించి—గోరీ, బలములనెల్ల సిద్ధముచేసి
కొని, స్థానేశ్వరముకొఱకుఁ దన్నుఁ గలిసికొనుమని భీమ జయ
చంద్రులకు వార్తఁబంపెను.

అక్కడఁ బృథ్వీరాజు సంగతియంతయు వినెను. గోరీ భీమ
జయచంద్రుల సైన్యమంతయుఁ గలిసివచ్చినచోఁ బోరుట కష్ట
మని యుద్ధప్రయత్నములు విశేషముగఁ జేసి, వెంటనే సైన్య
సమేతముగా రమ్మని బావమఱదియగు సమరసింహునకు
వార్తఁబంపెను.

పృథ్వీరాజు పంపిన వార్తవిని సమరసింహుఁడు తన
పుత్రుఁడయిన కల్యాణరాయనితోఁ గూడ సైన్యసమేతుఁడై
ఢిల్లీకివచ్చెను. ఇంకను రావలసిన వారందఱునువచ్చిరి. పృథివీ
శ్వరుఁడొక్క సభగావించి వీరులతో గంభీరస్వరమున నిట్లు
పలికెను. "యోధులారా! నాయెడల గౌరవభావముంచి
గోరిని దాకనున్న నాకు సహాయమాచరింప వచ్చినందులకు
మీకు నేనెంతయుఁ గృతజ్ఞుఁడను. ఇదివఱకు నాచే నేడుసారు
లోడింపఁబడిన గోరీ, మరల జయచంద్రుని ప్రేరేపణమున
నాపైకెత్తివచ్చుచున్నాఁడు. ఇదివఱకు జరిగిన యుద్ధముల
కన్న నియ్యది ఘోరమై యొప్పునని నాయభిప్రాయము. అది
యుఁగాక నాతని సైన్యమును, భీమచంద్రుల సైన్యమును గలి
సినచో మనసైన్యముకన్న నధికముగనుండును. ఏదియెట్లు
న్నను మనలో రణమునకు వెనుదీయువారులేరు. క్షత్రియునకు

సంగ్రామమే మోక్షము. రణరంగమున కవతరించిన పిమ్మట
శత్రువులఁగూల్చుటో లేక చచ్చుటో జరుగవలయును. ఈ
యుద్ధముతో భారతదేశ స్వాతంత్ర్యము నశించుటో లేక
శాశ్వతముగనుండుటో జరిగితీరవలయును."

ఈవిధమునఁ బృథ్వీశ్వరుఁడు పలికినయంతనే యారాజ
భాగేవతుల భావములందొకవిధమైన యుత్సాహముతోఁ
గూడుకొన్న నవశక్తియుదయించెను. వారందఱును బృథ్వీరా
జుంజూచి, శక్తివంచనలేకుండ సమరమొనర్తుమని బాసలు
చేసిరి. అంతటఁ బృథ్వీరాజు సమరప్రయత్నము లన్నియుఁ
బూర్తిఁజేకొని యొకసుదినమున స్థానేశ్వరక్షేత్రము నకు బయ
లుదేరెను. అంతకుమున్నె గోరీయు, జయచంద్రభటులును
స్థానేశ్వరము చేరియుండిరి. పృథ్వీరాజు బలములతో వచ్చి వారి
నెదుర్కొనెను. ఉభయసైన్యములకును ఘోరయుద్ధము జరిగెను.
అంతకుమున్నెప్పుడును నుభయపక్షములవారును నీవిధముగఁ
బోరియుండలేదు. కాని, చంచలచిత్తయగు సామ్రాజ్యలక్ష్మి
పృథ్వీశ్వరుని విడచు దినములు వచ్చియుండుటచేత నాతని
యోధులెల్లరును మడసిరి. సైన్యములోఁ జాలభాగము నశిం
చెను. అహా! కాలమహిమ! భరతఖండమునఁ దనకెందును
నెదురులేని శౌర్యమునఁ జరించుచు, ఢిల్లీ మహాసామ్రాజ్య
లక్ష్మిఁ బరిపాలించుచుండిన పృథ్వీరాజు నేఁడుదుగుల దైన్య
మొందినాఁడు. విధి ప్రతికూలుఁడై యున్నప్పుడెవ్వరేమి సేయఁ
గలరు!

ఆమహాశూరుఁడు తాతార్ఖానను మహమ్మదీయునకుఁ జిక్కి బంధింపఁబడెను. "నేను గోరిని ఏడుసారులు బంధించి విడిచిపెట్టితిని. ఈయుపకారమునైనఁ దలంచి నన్నువిడువు" మని పృథ్వీరాజు కోరెను. తాతార్ఖానుఁడు పృథ్వీరాజును గోరియొద్దకుఁ దీసికొనిపోయెను. పృథ్వీరాజుచే నవమానింపఁబడి యింటికట్టంతయు నిచ్చిన స్వామిద్రోహియగు హాహూలీరాయుడును, జయచంద్రభీములును, గోరియొద్దనుండిరి. వారందఱును పృథ్వీరాజు ననేక విధముల దూఱిరి. కఠినహృదయుఁడైన గోరీ పృథ్వీరాజుగుడ్లు పీకించి కాళ్లకులోహపు బేడీలను వేయించెను. తరువాత గోరీ విజయలక్ష్మిని వరించి వందులకు సంతసించుచు బంధింపఁబడియున్న పృథ్వీరాజును వెంటఁబెట్టుకొని ఢిల్లీనగర మాక్రమించుటకు వెడలెను. ఇంతకుమున్నే పృథ్వీరాజునకుఁ గలిగిన దుస్థితి ఢిల్లీయందున్న వారికిఁ దెలిసెను. ఇచ్ఛనీకుమారి, సంయుక్త మొదలగు అంతఃపురకాంతలు గోరీరాక విని తమ దేహముల నగ్నిహోత్రునకాహుతిఁ జేసిరి. గోరీవచ్చి ఢిల్లీ నాక్రమించుకొనెను. పృథ్వీరాజు కారాగృహమున బంధింపబడెను. ఢిల్లీయందుఁ గోరీ కొన్నిదినములుండి, కుతుబుద్దీన్ అనువానిని రాజప్రతినిధిగా నేర్పఱచి తన యన్నయగు గ్యాసుద్దీనును జూచుటకు గజనీపట్టణమునకుఁ బోయెను.

కుతుబుద్దీన్ గజనీపట్టణమునఁ గొన్నాళ్ళుండి మరల ఢిల్లీకివచ్చి యేమి యాలోచించెనోగాని కనోజిపై దాడివెడలెను. ఈకనోజపురాధీశుఁడే జయచంద్రుఁడు. తొలుత గోరీకి

హిందూదేశమునకై నాశపుట్టించినవాఁడే యితఁడు. అట్టి
జయచంద్రుని మీఁదకే యాగోరీ వెడలెను. అప్పుడు జయ
చంద్రుఁడు ఢిల్లీరాజ్యవినాశమునకై తాఁజేసిన దుష్కా
ర్యమునకై వగచి, బ్రిదికియుండి లోకుల మొగముఁజూచుట
కన్న మరణమే శ్రేయమని తలంచి, గోరీని యుద్ధమునఁ దాకు
టకుఁ బ్రయత్నము లేమియుఁ జేయక, నదిలోఁబడి దేహత్యా
గముఁ జేసెను. అతని యంతఃపురస్త్రీలుఁగూడ నగ్నింబ్రవే
శించి ప్రాణములఁ బాసిరి. జయచంద్రునకు దేశద్రోహకా
ర్యమునందుఁ దోడ్పడిన భీమునకుఁగూడ నిట్టిగతియే పట్టిన
దని చెప్పవచ్చును.

ఇఁక మనము పృధ్వీరాజుంగూర్చి విచారింతము.
అతఁడు తన పూర్వస్థితికి వగచుచు గాలము గడపుచుండెను.

చాందభట్టు:— ఇతఁడు పృధ్వీరాజున కాస్థానకవియై
యుండుటయేగాక, ప్రాణసఖుఁడుగూడనై యుండెను. ఈకవి
"పృధ్వీరాజరాసా" యను గ్రంథమును రచించెను. ఇతఁడు
పృధ్వీరాజు చెఱఁజిక్కిననాటనుండియు, నాతని నెట్లయిన విడి
పించుటకుఁ బ్రయత్నించుచుండెను. ఆకారణమున నాతఁడట్లో
గోరీసంస్థానమును జేరి, తన కవిత్వముచే నాతనిని వశముఁ జేసి
కొని, చనువుగా వర్తించుచుండెను. ఇట్లు కొన్నాళ్ళు జరిగిన
పిమ్మట చాందభట్టు గోరీ యనుమతినివడసి కారాగృహమున
నున్న పృధ్వీరాజును జూడఁబోయెను. చాందభట్టుయొక్క అడు
గుల చప్పుడు విని పృధ్వీరాజు "ఎవరు వా"రని యడిగెను.
భట్టు దుఃఖమును బట్టఁజాలక నేనని ప్రత్యుత్తరమిచ్చెను. కంత

స్వరమునుబట్టి యాతఁడు చాందభట్టుని గ్రహించి, పృథ్వీరా
జాతనిని కౌఁగలించుకొని విలపించెను. భట్టు "మన మిరువుర
మును త్వరలోనే విముక్తినందఁగలుగుదు" మని చెప్పి, యేర్పా
టు వ్రాసెను.

ఒక దినమున గోరీసభలో ధనుర్విద్యాప్రావీణ్యమును
గూర్చి ప్రశంస వచ్చెను. అప్పుడు చాందభట్టు గోరీతో
"పృథ్విరాజు కన్నులు లేనివాఁడైనను శబ్దమునుబట్టి బాణము
వేయు"నని చెప్పెను. వెంటనే గోరీ పృథ్విరాజుయొక్క శర
సంధానచాతుర్యముఁ జూడవలయునని యాతనిని రమ్మనమని
వార్తఁ బంపెను. "నేను నా పూర్వదుస్తులును, నావిల్లును ధరిం
చినఁగాని సభకు రాఁజాల"నని పృథ్వీశ్వరుఁడు ప్రత్యుత్తరమం
పెను. అంతట గోరీ పృథ్వీశ్వరుఁడు గోరిన ప్రకారమాతఁడు
ధరించు దుస్తులును, విల్లును బంపెను. పృథ్విరాజు వానిం
ధరించుకొని, ముందు సేవకుఁడు త్రోవఁజూప సభాస్థలము
నకు వచ్చెను. తన విముక్తికొఱకు చాందభట్టేదో యొక
మాయను బన్నినాడని యాతఁ డూహించెను. గోరీ, పృథ్వీ
రాజు ననేకవిధములఁ బొగడి, విలువిద్యయందున్న నేర్పును
జూపుమని యడిగెను. చాందభట్టు పృథ్వీరాజుతో "గోరీ
శబ్దమునుబట్టి యాస్థానమున బాణము తగులునట్లు ప్రయో
గింపు"మని పలికెను. సభ్యులెల్లరును పృథ్విరాజుయొక్క శర
నైపుణ్యమును జూచుట కుత్సాహులై యుండిరి. చాందభట్టు
పృథ్విరాజు సమీపమునకుఁబోయి నిలిచెను. పృథ్విరాజు శర
మును సంధించి నిలిచెను. గోరీ యొకచోట 'టకటక' యను

శబ్దము చేసెను. వెంటనే పృథ్వీశ్వరుఁడు శరము విడిచెను. సింహాసనమునందున్న గోరీ 'హా! చచ్చితి' నని పలుకుచు నేలఁ బడి ప్రాణములు విడిచెను. ఆక్షణముననే చాందభట్టు, పృథ్వీరాజులు కత్తులచేఁ బొడుచుకొని ప్రాణములఁ బాసిరి.

ఇంతటితోఁ బృథ్వీరాజు చరిత్ర ముగిసినది. "హా! ఢిల్లీ సామ్రాజ్యలక్ష్మీ! భారతీయవీరభుజాకీర్తిపైఁ దాండవించిన దినములు పోయినవి. సమస్తైశ్వర్యమును గోల్పోయి, కీర్తిమాత్రావశిష్టవై, చరిత్రకారులచే నీపూర్వస్థితి వినవలసిన యదను వచ్చినది!"



# 3. అక్బరు.

భారతవర్షేతిహాసంబున జాతీయజీవనభావనముఁ గల్పించుటకుఁ బాటుపడిన మహాపురుషులలో నక్బరుచక్రవర్తిని నగ్రపీఠ మీయవచ్చునని నొక్కి వక్కాణింపవచ్చును. హిందూ మసల్మానులు ఏక దేశస్థులనియు, నిరంతరము సోదర భావమును మెలంగవలయునియు, వారివారి మతాచార భేదములు రాజకీయ వ్యాపారమున కాటంకము గలుగఁజేయవనియుఁ దలంచి హిందూమహమ్మదీయసమ్మేళనము ప్రజలయందుఁ బ్రవేశపెట్టి, యక్బరు కొంతవరకు గృతార్థుఁడై మహాపురుషులలో నొక్కఁడుగఁ బరిగణింపఁబడినాఁడు. భరతవర్ష మహోద్ధారణకై పాటుబడు ప్రతి మనుజుఁడును నక్బరు మార్గములను మఱువకయుండునుగాక!



ఆసియాఖండమధ్యమున సమర్కాండను నగరమునకు సమీపమున 'షెహ్రెసబ్జు' అను పురమొకటి కలదు. ఇచ్చట మొగలాయివంశమున తైమూర్లంగను నొక యోధుడు

జనించి, స్వశక్తిచే దిగ్విజయంబొనర్చి, యాసియాఖండమున సర్వస్వాతంత్ర్యచక్రవర్తిపదము నధిష్ఠించి 1405 వ సంవత్సరమున దివం బలంకరించెను. ఇతని తరువాత నాల్గవవాఁడగు 'మీర్జా' యనునతఁడు రాజ్యార్హుఁడగునప్పటికి 'కోకందు' అను నొక రాష్ట్రముమాత్రమే మిగిలియుండెను. ఈతనికి జనించినవాఁడే బేబరు. తండ్రి చనిపోవునప్పటికీతఁడు చిన్నవాఁడైయుండెను. సమయ మెఱింగి రిపులు దేశమును ముట్టడించిరి. ధైర్యచిత్తుఁడైన బేబరు చలింపక, యొక దిట్టమైన కోటలోఁ బ్రవేశించి, శత్రుసైన్యము లపరిమితముగనుండుటచే వారితో సంధిఁ జేసికొనుటకై తలంచుచుండెను. ఇంతలో శత్రువులే తమలోఁదాము కలహించి దేశమును విడిచిపోయిరి. శత్రుబాధ తప్పెనుగదా యని బేబరు, తన చిన్నరాజ్యమును బాగుచేసికొని, యితరరాజ్యముల జయించుటకు బయలుదేరెను; కాని, దురదృష్టుఁడగుటచే నీకలహములందుఁ బరులచే నోడింపఁబడి తన రాజ్యమును గూడఁ గోలుపోయెను. కొన్ని దినములు కష్టములకులోనైయుండి, మరలఁ బరాక్రమమున విజృంభించి కాబూలును బట్టుకొని, యచ్చటనుండియే దేశముపైఁబడి, దానిని జయింతునాయని తగిన సమయమునకై వేచియుండెను.

ఇట్టిసమయమున భరతవర్షమంతయుఁ కలహములకు లోనైయుండెను. ఇబ్రహీంఖానుఁడనునతఁడు ఢిల్లీరాజ్యమేలుచుండెను. పరిపాలనమునందీతఁడసమర్థుఁడు. ఈతనికిందఱో విరోధులుండిరి. అందు పంజాబునకు నాయకుఁడైన దౌలతులోడీ

యనునతఁడు, బేబరునకు రహస్యముగా నిబ్రిహింఖానుని విష యమై తెలిపి, ఢిల్లీపై దండెత్తుమనివార్తఁబంపెను. ఎరకై వేచి యున్న సింగమువలెనున్న బేబరు, అదియే తగినసమయమని తలఁచి, తనబలముల ఢిల్లీపైకినడపి, యిబ్రిహింఖానుని బరాజితునిఁజేసి, సింహాసనమాక్రమించెను. అతఁడు క్రమముగా నుత్తరహిందూస్థానమంతయు వశముఁజేసికొని, మొగలాయి రాజ్యమునుస్థాపించి, యవక్రపరాక్రమమున నిరంకుశముగ రాజ్యమేలి, లోకైకవీరుఁడని యశమంది 1530 సంవత్సరమున గీర్తిశేషుఁడయ్యెను.

బేబరుయనంతరము నీతనిపుత్రుఁడగు "హుమయూను" రాజ్యపీఠమధిష్ఠించెను. తండ్రివలె నీతనియందన్ని గుణములు నుండెనుగాని రాజ్యపాలనమునందు మాత్ర మసమర్థుఁడు. 1540 సంవత్సరములో నీతఁడు "షర్షాస్" అను మహమ్మదీయ వీరునిచే "బక్సారు, కనోజి" యుద్ధములయందోడిపోయి రాజ్యచ్యుతుఁడై దేశమువిడిచి పాఱిపోయి, సింధునదీతీరమున రోహిలిపట్టణమునఁ దన మాఱుతమ్మునియింటఁ గొన్నాళ్లుండెను. శత్రుపులీతనిని వెన్నంటి వచ్చుచున్నారని తెలిసి, యాతఁడచ్చోటువాసి, భార్యతోఁగూడ నమరకోటకరిగెను. భార్య నిండుచూలాలగుటచే నిచ్చటఁ బురుడు వెళ్ళుచ్చుకొనఁదలఁచి వేచియుండ 1542 సంవత్సరము అక్టోబరు 15 తేది ఆదివారమునాఁడు మన కథానాయకుఁడగు నక్బరుజనించెను. కుమారోదయమువలన హుమయూనుకష్టములు గట్టెక్కలేదు. ఈతఁడు 1543 సంవత్సరమున సతీసుతులతో సింధు

దేశము విడిచి కాంధారమునకు వెడలెను. మార్గమధ్యమందుం
డంగా హుమయూను సోదరుఁడైన "అస్కారీ" యనునతఁడు
సైన్యముతోఁ దన్నుఁ జాపుటకు వచ్చుచున్నాడని యెఱింగి,
పసిబాలుని యెండలలోను, మంచులోను గొనిపోవుట యపా
యమని యూహించి, వానిని దన గుడారమునందే యుంచి,
యర్థరాత్రిసమయమున నాతఁడు భార్యతో నాస్థలము విడి
చెను. అస్కారీవచ్చి హుమయూను దొరకనందులకు విచా
రించి గుడారమునందున్న బాలునిజూచి, యానందమందుచు
గాంధారమునకుఁ గొనిపోయెను. అస్కారియు నతనిభార్యయు
నక్బరును గన్నకొడుకువలెనే ప్రేమతోఁ జూచుచుఁ బోషించు
చుండిరి. అక్బరీవిధముగా నొకసంవత్సరము పెరిగెను. హుమ
యూను దేశదేశములు దిరిగి, తన స్నేహితులసహాయము
వలనఁ గొంతసైన్యమును సంపాదించి, యాఫగనిస్థానమును
ముట్టడించెను. ఇందులకు "అస్కారి" భీతినొంది, హుమ
యూను తన కుమారునెట్లయినఁ గొనిపోవునని తలంచి, వానిని
దనమేనత్తయగు ఖాంజదాబేగము (బేబరుతోబుట్టువు) స్వాధీ
నము చేసి కాబూలునకుఁ బంపివేసెను. అస్కారి తమ్ముఁడగు
కమ్రాను కాబూలుకోటను గాపాడుచుండెను. ఖాంజదాబేగు
నక్బరునతిగారాబముతోఁ బెంచుచుండెను. కాని, యిది
చిరకాలము జరుగలేదు. హుమయూను కాంధారదుర్గమును
దన స్వాధీనము చేసికొనెను. ఈకారణమున క్రమ్రాను కాబూ
లుకోటను రక్షించుకొనుటకు భయమంది, ఖాంజదాబేగము
నందు నమ్మకము లేకపోవుటచే నక్బరును నమ్మకమైన యొకని

వశము చేసి, హుమయూనును బెదరించి రాజ్యరహితునిగా జేసి
కొనఁదలంచెను. కాని, హుమయూనునకు మంచిరోజులు
వచ్చుటంజేసి, యాతఁడు సేనలతో వచ్చి కాబూలుదుర్గమును
ముట్టడించెను. కమ్రాను పాఱిపోయెను. శత్రువులు పాఱిపోయి
నను బుత్రుఁడు చిక్కినందులకు హుమయూను సంతోషిం
చుచు- బుత్రసహితముగా "కిలజాఫర్" అను నగరమునకుఁ
బోవ బయలుదేరెను. మార్గమధ్యమున నాతఁడు జ్వరబాధా
పీడితుఁడై ప్రయాణము సాగించుటకు వీలులేనిస్థితియందుం
డెను. ఇంతవఱకును నాతనిచే పోషింపఁబడుచున్న సేవకులు
కమ్రానును జేరుటయేగాక, యక్బరుకుమారునిఁగూడ నాతని
వశముఁజేసిరి. దేహమునకు స్వస్థతగలిగినయంతనే, హుమ
యూన్ తనయొద్దనున్న సేనలతో మరల కాబూలునకు
బయలుదేరెను. కమ్రాను మరల వచ్చి హుమయూనుందాక
ఘోరముగఁబోరాడెనుగాని కాబూలుకోట సంపూర్తిగహుమ
యూనునకుఁ జిక్కుటంజేసి, కమ్రాను భయమంది యక్బరు
నచ్చటనే విడిచి పాఱిపోయెను. కాబూలునకుఁ బశ్చిమభాగ
మునఁ గొన్నియల్లరులు కలుగఁగా వానినడంచుటకు, హుమ
యూన్ బయలుదేరుచు 8 సంవత్సరముల వయస్సుననున్న
యక్బరును తనగురుఁడగు ఖాసింఖాన్ అను వాని పరముచేసి
వెడలెను. ఈసందర్భమున కమ్రాను మరల కాబూలుపై
దండెత్తి అక్బరును ఖైదీగాఁగైకొనెను. హుమయూనునకీవార్త
తెలిసి దురాగ్రహావేశుఁడై వచ్చి "ఖూతసుగార్డ"ను స్థలమున
కమ్రానుందాక జయము గాంచెను. కమ్రాను పాఱిపోయెను.

సేవకులచ్చరుండెచ్చి హుమయూనునకొసఁగిరి. తరువాతఁ గొన్నాళ్లకు హుమయూను—కమ్రాను—వాని సోదరుఁడయిన అస్కారిని బట్టుకొని మక్కాకుఁ బ్రవాసమంపెను.

ఇట్లు సోదరులవలన బాధలను దప్పించుకొని హుమయూను తన పూర్వరాజ్యమును మరల సంపాదింపనెంచి, తొలుత కాశ్మీరమును జయించి, సింధునదిందాటి పెషావరు కోటను బలపఱచుకొని, యచ్చటనుండి ఢిల్లీకోటను బట్టుకొనుటకై ప్రయత్నించుచుండెను. ఇంతకుమున్ను హుమయూను నోడించి, బేబరుచే నార్జింపఁబడిన రాజ్యమంతయు నాక్రమించుకొని పాలించిన షర్ఖానుఁడు మరణించెను. ఇతని తరువాత సికందరు పరిపాలనమున నసమర్థుఁడై రాజ్యము నంతయుఁ జేగొట్టుకొనునంతటి దుస్థితినుండెనని యెఱింగి, హుమయూను తన సేనలఁబురికొల్పుకొని యాతనిపైకి వెడలెను. సికందరు సేనలకును, హుమయూను సేనలకును “సరహిందు” అను ప్రదేశమున గొప్పయుద్ధము జరిగెను. హుమయూనునకు ముఖ్యస్నేహితుఁడును, సేనానాయకుఁడునైన బైరంఖానుఁడు సికందరును సంపూర్తిగ నోడించెను. అంతట హుమయూను దానింతకుమున్ను కోల్పోయిన రాజ్యము మరల లభించినందులకు సంతసించుచు ఢిల్లీపురమును బ్రవేశించి, వెంటనే పంజాబు, రోహిల్ఖండ్, ఆగ్రాలను స్వాధీనము చేసికొనెను.

ఈసమయమున “హేము” అను హైందవుఁడు బంగాళమును దనవశము చేసికొని, ఢిల్లీపై దండెత్తఁ దలఁచుచుండెను. ఓడిపోయిన సికందరు మరల పంజాబును చేరి సైన్యము

లఁ జేర్చుకొనుచుండెను. ఈవార్తలువిని హుమయూను ఢిల్లీ యందేయుండి, యక్బరు బైరాంఖానులను సికిందరును దాకఁ బంపి, తాను హేమురాకకై వేచియుండెను.

అక్బరు బైరాంఖానునితో 1556 సంవత్సరము జనవరి నెలలో సరహిందు పురమునుజేరి, సికిందరును వెంటాడింప దలంచుచుండఁగా ఢిల్లీయందు హుమయూను మేడమెట్లపై నుండి జారిపడి మృతినొందెనను వార్తవచ్చెను. వెంటనే బైరంఖానుఁడు అక్బరును చక్రవర్తిగాఁ బ్రకటించెను.

—: పా ని ప ట్టు :—

ఈ పానిపట్టు పురాణ ప్రసిద్ధినందియుండుటయే గాక చరిత్ర సంబాధమునఁగూడ మిగుల విఖ్యాతినందియున్నది. ఈప్రదేశమున 1526 సంవత్సరమున జరిగిన యుద్ధమున జయము గలుగుటచేతనే బాబరు ఢిల్లీ రాజ్యము నాక్రమించుకొనఁగలిగెను. మరల నిచ్చటనే హేము 1556 సంవత్సరమున అక్బరుందాక యపజయమందెను.

అక్బరు కలనూరియందుండఁగా హుమయూను మరణ వార్త తెలిసెను. తరువాత నీతఁడు సికిందరును వెంటాడించుచుఁబోయి మాలుకోటయందుండెను. ఇక్కడ నీతఁడుండఁగా హుమయూన్ మరణముచేఁ గాబూలున వల్లరులు సంభవించె నని విని వానిఁ డఁగద్రొక్కుటకు వెడలెను.

అక్కడ హేము దుర్వారబలుఁడై యాగ్రాను ముట్టడించి, ఖడ్గముతో నవసరములేకుండనే యాపురమును స్వాధీ

వశము చేసికొని, ఢిల్లీపై దండెత్తివచ్చి, హుమాయూనుచే నచ్చట
నుంచఁబడిన తార్దీబేగునోడించి యాగ్రాపురమునుగూడఁ దనవశ
ము చేసికొనెను. ఈవార్త యక్బరు కర్ణములఁబడిన యంతనే,
బాలుఁడైనను ధైర్యసాహసములతో నొప్పునాతఁడాలోచనఁ
చేసి, యందఱివారిని గర్తవ్యము విచారింపుఁడని పలికెను.
“ఇప్పుడు హేముపైఁ బోవుట మానివేసి, కాబూలులో నిలు
కడ కుదుర్చుకొండ”ని కొందఱు పలికిరి. బైరంఖానుఁడు
మాత్రమందులకు సమ్మతింపక, హేముతోఁ బోరాడి యతనిని
బరాజితుని చేసి, ఢిల్లీనాక్రమించుకొనుట మంచిదని నుడివెను.
అక్బరు బైరంఖాను వాక్యములకు సమ్మతించి సేనలనాయత్త
పఱుపుమని చెప్పెను. సేనలను సిద్ధముఁ జేసికొని యక్బరు
బయలుదేఱి సరహిందు అను పురమును వశము చేసికొనెను.
హేముచే నోడింపఁబడిన తార్దీబేగు హతశేషులయిన
వారితో వచ్చి యక్బరును గలిసికొనెను. బైరంఖానుఁడు తార్దీ
బేగును దన గుడారమునకుఁ బిలిపించి రహస్యముగఁ జంపిం
చెను. మతవైషమ్యమే యిందులకుఁ గారణమని చెప్పుదురు.
అక్బరు రాకవిని హేము సేనలతో ఢిల్లీకి 15 మైళ్ళ దూరమున
నున్న పానిపట్టువద్దకు వచ్చియుండెను. అక్బరును 1556 సంవ
త్సరము నవంబరు 5 తేదీని పానిపట్టునకుఁ జేరెను. అక్బరు
హేములకు దారుణమైన సంగ్రామము జరిగెను. ఘోరరణంబున
షాకులీఖాను అను [illegible] హేముని [illegible] పట్టుకొని బైరం
ఖానున కప్పగించెను. బైరంఖానుఁడు ప్రాణావశిష్టుఁడైయున్న
హేముని నక్బరునొద్దకుఁ దీసికొనివచ్చి “ఈతనిపై నీఖడ్గకౌశ

ల్యము జూపు" మని చెప్పెను. అక్బరు బైరంఖానునిఁజూచి
"ఈతఁడు మనచేతికిఁ జిక్కినాడు. ఈతనిం జంపఁదగు" నని
పలికెను. క్రూరచిత్తుఁడగు బైరంఖానుఁడు హేమును దన ఖడ్గ
ముతో నఱికివైచెను. బైరంఖానునియందున్న భయభక్తులచే
నక్బరేమియు సేయలేకపోయెనుగాని తన ధర్మపరిపాలనమున
నిట్టి యకార్యము జరిగెనని యతఁడు బ్రతికియున్నంతవఱకు
విచారించుచునే యుండెను. తరువాత నక్బరు పరివార సమే
తుఁడై ఢిల్లీనగరంబుఁ బ్రవేశించి రాజ్యాభిషిక్తుఁడయ్యెను.

## రాష్ట్రనిర్మాణము.

రాష్ట్రనిర్మాణముఁ జేయఁదలఁచినచో రాజ్యసంపా
దన కావలసియుండును. అక్బరు ఢిల్లీయందు సింహాసనాసీనుఁ
డగునప్పటికి హిందూస్థానములోఁ జాలభాగము చిన్న చిన్న
సంస్థానాధీశ్వరులకు లోబడియుండెను. బంగాళము, బేహారు
మొదలగు ప్రదేశములు అఫగనులచేఁ బాలింపబడుచుండెను.
దక్షిణపశ్చిమహిందుస్థానము సర్వస్వతంత్రులయిన రాజులచే
నేలఁబడుచుండెను. పంజాబు మొదలగు కొన్నిప్రదేశములు
మాత్ర మక్బరునకు లోబడియుండెను. ఇందు పంజాబుమాత్ర
మక్బరునకు లోబడియుండినను సంపూర్ణముగ స్వాధీనము
కాలేదు. ఇంతకుమున్న అక్బరుచే నోడింపఁబడిన సికందరు
మానుకోటను నివాసముగాఁ జేసికొని క్రమక్రమముగా
పంజాబు నాక్రమించుచుండెను. ఈసమయమున నక్బరు
సైన్యసమేతుఁడై జలంధరుపట్టణముననున్న సికిందరుపైకిఁ

బోయెను. సికిందరు మానకోటకుఁ బోయి దాగెను. అక్బరు ఆరుమాసములు మానకోటను ముట్టడివేసియుండఁగా సికిందరు సంధికి వచ్చెను. సికిందరు కుమారునిఁ దనయొద్దనుంచుకొని, యక్బరాతనిని బంగాళమునకుఁ బొమ్మని విడిచిపెట్టెను.

1558 సంవత్సరములో నక్బరు ఢిల్లీ ప్రవేశించి బైరంఖానుని వచనముల ననుసరించి రాజ్యపరిపాలనము సేయఁదొడఁగెను. కాని, బైరంఖాను నెట్లో వదలించుకొనవలయునని మాత్ర మతఁడు తలంచుచుండెను. బైరంఖానుఁడు క్రూరమనస్కుఁడు. అక్బరున కిష్టులయినవారితోఁ గలహించుచుండును. ఒక్కసారిగ బొమ్మని చెప్పినచో నాతఁడేమి దారుణకృత్యము సేయునో యని యక్బరు భయమందుచుండును. అదియుంగాక తండ్రిపోయినప్పటినుండియు జాగరూకతతోఁ గాపాడి, యక్బరును ఢిల్లీసింహాసన మధిష్ఠింపఁజేసినది బైరంఖానుఁడే. అందుచేత నాయుపకారము నెట్లు మఱతునాయని యక్బరొకొక్కప్పుడు తలంచుచుండును. కాని, బైరంఖానుని క్రూరకార్యము లెక్కువయయ్యెను. అందుచే నక్బరు క్రమముగా బైరంఖానునిచేతనున్న యధికారమును తగ్గించి "రాజ్యసంబంధమయిన విషయములన్నియు నింతటినుండి స్వయముగా నెఱవేర్తుననియుఁ, దన చేవ్రాలులేని యేయుత్తరువులును చెల్లఁగూడ"దనియు రాష్ట్రమున బ్రకటించి బైరంఖానునకు "ఇంతటినుండి రాజ్యపరిపాలనము నేను చూచుకొందును. నీవు కోరినట్లు మక్కాయాత్ర కరుగవచ్చును. నీవ్యయమునకై తగిన యేర్పాటుచేయుదు"నని లేఖ వ్రాసెను.

బైరంఖానుఁడీయుత్తరముఁ జూచి వెంటనే బయానా పట్టణమున కరిగి, యచ్చట నక్బరుచే ఖైదులోనుంచఁబడిన వారిని విడిచి, యక్బరుపైఁ గుట్రఁ బన్నసాగెను. అక్బరీ సంగతి విని యచ్చటకు వెడలఁగా బైరంఖానుఁడు శరణుఁ బొందెను. అక్బరు వానిని గరుణించి మక్కాకుఁ బంపివేసెను. ఇట్లు బైరంఖానుని వదలించుకొని, యక్బరు రాష్ట్రనిర్మాణమునకుఁ దగిన ప్రయత్నములు సేయదొడంగెను. స్వమతావేశప్రవిష్టులకు మహమ్మదీయులకు హిందువులతో సఖ్యము గలిగించవలయుననియు భరతవర్షపు జనులలో న్యాయము, దయ, సౌభ్రాతృత్వము, స్వాతంత్ర్యముఁ గలుగఁజేయవలయుననియు నాతఁడు తలంచెను. దీనికై యాతఁడు దేశము సంతయు జయించి, జనుల నందఱిని నొకశాసనముక్రింద నిలుపనెంచెను.

## యుద్ధములు.

ఈపై జెప్పఁబడిన యుద్దేశములతో అక్బరు 1562 సంవత్సరమున మాళవదేశముపై దాడివెడలెను. విశేషశ్రమనందకుండ దానిని స్వాధీనము జేసికొని, యాపైసంవత్సరమున జోధపురరాజును భీమసంగ్రామమున నోడించి, తన పరాక్రమశౌర్యములు ప్రపంచమునకు వెల్లడిఁజేసెను. అక్బరుచే నోడింపఁబడిన రాజులందఱును గలిసి మాళవేశ్వరుని సహాయమును గొని మరల మాళవమును సంపాదించుకొనిరి. కాని, యక్బరు వెంటనే యధికసైన్యమును రావించి, వారి నెల్లర నోడించి పరధ్వస్తులఁ జేసెను. ఈసమయమున వారికేవిధమైన

మార్గము దోచక యక్బరు శరణుఁజొందిరి. అక్బరు వారిం
గరుణించి యభయమొసఁగి, యున్నతపదవులందు నిలిపెను.
తనచే నోడింపఁబడిన వారి కాతఁడు తన యాస్థానమున
నున్నతోద్యోగములనిచ్చి, యనేకవిధముల గౌరవించి, మైత్రి
నెఱపుటం జేసి, యాతనితోఁ, బోరాడఁదలఁచిన వారుగూడఁ
బోరాటముమాని విధేయులై, యాతనిని రాజాధి రాజుగ
నంగీకరించెను.

పంజాబునకుఁ బశ్చిమదిక్కునయున్న "కాకస్థు" అను
నొక తెగవారు కలహింపఁగా నక్బరు వారిపై కరిగి, యాకల
హము నడంచివేసెను. 1564 సంవత్సరమున నలహాబాదు
ప్రాంత దేశమునకు దండువెడలి మార్గమునందు మూనారు
వశము జేసికొని, మాండూపట్టణముమీఁదికి నడచెను. ఈ
మాండూ నవాబు తన పుత్రికలలో నొకతెను నక్బరునకుఁ
గానుకగా నర్పింపఁ గైకొని, యాగ్రాకువచ్చి తనపేరు శాశ్వ
తముగా నిలుచునట్లొక కోటఁ గట్టించెను. దీనిఁ గట్టించుట కెని
మిది సంవత్సరములు పట్టెనని చెప్పుదురు. ఈసంవత్సరాంత
మున నచ్చటచ్చట గలిగిన చిన్న కలహముల నక్బరణఁచి
వేసెను.

ఇప్పటికిఁ దూర్పురాష్ట్రమంతయు నక్బరునకు వశమై
శాంతముగ నుండెను. ఇప్పుడాతఁడు తన దృష్టిని రాజపుత్ర
స్థానముపై నిలిపెను. రాజపుత్రులు సామాన్యులుగారు. అద్వి
తీయ పరాక్రమోపేతులు. రణరంగ ప్రవీణులు. రజపుత్ర
సంస్థానములయందెల్ల మేవారు గొప్పది. దానికి ఏరాగోసిన

వాఁడగు ఉదయసింహుఁ డధిపతియై యుండెను. అరిజనాభేద్యమగు చిత్తూరు దుర్గము వీనిచేఁ గాపాడఁబడుచుండెను. అక్బరీ చిత్తూరుపైకి దండెత్తివచ్చి కోటముట్టడించెను. రసపుత్ర వీరుల శౌర్యమున కాతఁడద్భుతమందెను. ఎట్టకేలకు జయలక్ష్మి యక్బరునే వరించెను. అక్బరు సంతసించుచు నాగ్రాకు వచ్చి, వర్షాకాలమగుటచే విశ్రాంతిఁ దీసికొని, మరల బయలుదేరి జయపురము, రతంబోరుకోటలను ముట్టడించి యాసంస్థానాధీశ్వరులను వశము చేసికొనెను. ఈసంవత్సరమున నాతఁడు ఫతిపూర్ సిక్రియను నొక పట్టణమును గట్టించెను. ఈసంవత్సరమునందే యాతఁడు గుజరాతును జయించెను. ఈతనికి మగపిల్లఁడు గూడఁ బుట్టెను. అతని పేరు సలీము. ఈకుమారుని తల్లి జోధపుర సంస్థానాధీశ్వరుని పుత్రిక. బీకనీరు రాజ్యాధిపతి గూడఁ దనపుత్రికను నక్బరునకిచ్చి వివాహముఁ జేసెను.

1572 సంవత్సరమునఁ గొన్ని కలహములు గలుఁగఁగా నక్బరు వానిని వారించెను. ఈతఁడు కేవలము యుద్ధమునందాసక్తిచే యుద్ధము చేయలేదు. దేశమంతయు నొక ప్రభుత్వముక్రింద నిలువఁబెట్ట వలయుననియు, జాతియైక్యత స్థాపింపవలయుననియు నీతని యుద్దేశము. ఈతఁడు యుద్ధములకు పోగినప్పుడు మార్గమధ్యమున నున్న గ్రామములకుఁ గాని, ప్రజలకుగాని యేవిధమైన హానియుఁ గలుగఁ జేసి యెఱుఁగఁడు.

ఈతఁడు బంగాళముపై దండెత్తి విజయము గాంచెను. 1574 సంవత్సరాంతమునకు హిమాలయ వింధ్యపర్వతముల మధ్యనున్న హిందూస్తానమంతయు నీతని [illegible]

బంగాళా దండయాత్రయందు ఈతని దాడికోడి పాఱిపోయిన దాఉదా నను వానిని 1575 సంవత్సరమునఁ బట్టుకొని యాతని మొదల దయాంతరంగుఁడై ఒరిస్సా రాజ్యమునకుఁ బ్రతినిధిగాఁ బంపెను. కాని, యచ్చట నాతఁడు మరల నేదో కుట్రఁబన్నుటచే మొగలు సేనానాయకునిచేఁ జంపఁబడెను.

1577 సంవత్సరములో రాజపుత్రస్థానమున నల్లరులు ప్రారంభమయినవి. చిత్తూరు రాణాతురుష్కులతో సంబంధ బాంధవ్యములంగీకరింప తిరుగఁబడెను. జోధపుర రాజు మొదలగువారు అక్బరుతో బాంధవ్యము నెఱపి మహోన్నత పదవులనందియుండిరి. 1568 సంవత్సరమున నక్బరుచే నోడింపఁబడిన మీవారు రాణాయగు నుదయసింహుఁడక్బరుతో బాంధవ్యము నంగీకరింపక, తన కులధర్మము నిలుపుకొనుటయే విధ్యుక్తధర్మమని తలంచి, రాజ్యమును త్యజించి యరణ్యముల కరిగి 1572 సంవత్సరమున మరణమందెను. ఈతని పుత్రుఁడే ప్రతాపసింహుఁడు. ఈతఁడు తన తండ్రియొక్క పట్టుదలను, మతమును విడువక, కమల్ మీరుకోటను దనకు ముఖ్యస్థానముగఁ జేసికొని, తండ్రి కోల్పోయిన రాజ్యమును మరల నార్జించుటకుఁ బ్రయత్నించుచుండెను. ఈవార్త అక్బరువిని ప్రతాపునిపైకి నడచెను. అక్బరు ప్రతాపులకు "హల్దిఘాట్" అను ప్రదేశమున 1577 సంవత్సరమున యుద్ధము జరిగెను. ఇందు రాణా యోడిపోయి యారవల్లీ పర్వతప్రాంతములకు బోయెను. అక్బరు మీవారు నాక్రమించుకొనెను.

1582 సంవత్సరమున కాబూలునకుఁ బ్రతినిధిగానున్న యక్బరు తమ్ముఁడగు హాకింమీర్జా కలహింపఁగా నక్బరరిగెను. మీర్జా యన్నను క్షమాపణ కోరెను. అక్బరు కరుణించి యాతనిని యథాస్థానమునందే యుంచెను.

1584 సంవత్సరమున అక్బరు ఫత్తెపూరునందుండి యచ్చటచ్చటఁ గలిగిన కలహముల నడఁచెను.

1587 సంవత్సరములో కాబూలులోనున్న యక్బరు తమ్ముఁడు గతించెను. అప్పుడు కొందఱు "ఉజ్బెగ్" మహమ్మదీయులు కలహించిరి. ఈగందరగోళముల నడఁచుటకై యక్బరు బయలుదేరి "అటక్" పట్టణమున నిలిచి, భగవాన్‌దాసుని యాధిపత్యమున నొకసేనను కాశ్మీరముపై బంపెను. ఒక సేనను బెలుచిస్థానము మహమ్మదీయులపైఁ బంపెను. ఒక సేనను "స్వాత్" దేశముపై బంపెను. ఈసేనకపజయము కలుగుటచే మరలఁ గొంత సైన్యమును—తన ప్రియహితుఁడును కవియు, శూరశిఖామణియు, భాసురుఁడునగు బీరబలుని యాధిపత్యమునఁ బంపెను. బీరబలుఁడచ్చట ఘోరముగఁ బోరి మరణించెను. పోరు ఘోరమైయున్నదని విని అక్బరు—మరల నచ్చటకు మానసింగును, రాజా తోడర్‌మాలును బంపెను. వీరచ్చట మహమ్మదీయుల నోడించి, శాంతి నెలకొల్పిరి. ఈసంగ్రామమున మానసింగు చూపిన పరాక్రమమున కక్బరు మెచ్చి యాతనిని గాబూలునకు నాయకునిగా నొనర్చెను. ఇట్లు జరిగిన కొన్ని దినములకే బంగాళమునందుఁ గలహములు సంభవించెను. అందుచే నక్బరు మానసింగును

బంగాళమునకు రాజప్రతినిధిగాఁ బంపెను. మనసింగు బంగాళమును బ్రవేశించి యల్లరులనన్నియు నడఁచివేసెను. అక్బరు తన రాజ్యమంతయు శాంతముగనున్నదని సంతసించెను గాని యీసంవత్సరమున నక్బరునకు ముఖ్యహితులును, రాజకార్యనిర్వాహకులునగు భగవాన్‌దాసు, రాజాతోడర్‌మల్లు మరణించిరి.

1590 సంవత్సరమున మనసింగు ఒరిస్సారాజ్యమును జయించెను. తరువాత నక్బరు దక్కనులోని మహమ్మదీయ రాజ్యములను జయింపనుంకట్టి సేనలను బంపెను. ఈదక్కను కలహములలో మూడువిప్లవములు సంభవించినవి. (1) దక్కనుపై కేగిన యక్బరు సేనానాయకులొకరితో నొకరు కలహించుట (2) అక్బరు పుత్రుఁడగు మూరాదు మరణించుట (3) అబుల్‌ఫాజల్ మృతినందుట.

అక్బరునకును నతని కుమారుఁడగు సలీమువలన కొన్ని చిక్కులు తటస్థించెను గాని కొలదికాలములోనే తండ్రికొడుకులు సఖ్యము వడసిరి. 1570 సంవత్సరమున మీవారు రాజ్యములో జరిగిన యల్లరుల నడఁచుటకు అక్బరు సలీమును బంపించెను. మరల రాణాప్రతాపసింగొడిపోయి యరణ్యములఁ జేరెను. అక్బరు సైన్యమాతని వెన్నంటుటచే మీవారు రాజ్యమును వదలి, సింధునదీతీరముఁ జేరి ప్రతాపుఁ డచ్చట మఱియొక చిన్నరాజ్యమును స్థాపించెను. తిరిగి యాతఁడు 1586 సంవత్సరమున మీవారుదేశమును సంపాదించెను గాని చిత్తూరుదుర్గమునూత్రి మక్బరు స్వాధీనమునందుండుటచే నత

యపురము వాసస్థానముగఁ జేసికొని 1597 సంవత్సరమున మృతినందెను.

## జా తి శ్రై క్య త.

అక్బరు హిందూదేశము బ్రవేశించినప్పటికెక్కడఁ జూచినను మతకలహములు ప్రబలియున్నవి. ఇట్టి మతవైషమ్యములన్నియు నశింపఁజేసి భరతవర్షమున జాతిశ్రైక్యతఁగలుగఁ జేయుటయే నాతని ముఖ్యోద్దేశము. ఈతఁడు సకలమతసారములను బాగుగ గ్రహించెను. బ్రాహ్మణ మతసిద్ధాంతముల సమ్మతించెను. మతవిషయ విచారమునందీ చక్రవర్తికి "ఫయిజీ—అబుల్ ఫాజల్" అను విఖ్యాతసన్నదమ్ములు మిగుల తోడ్పడిరి. అక్బరుయొక్క మత సిద్ధాంతములఁగూర్చి హిందీ కవిశేఖరుఁడగు "తెలిసను" అనునతఁడు "అక్బరు స్వప్నము" అను నొక కావ్యముగూడ వ్రాసెను. సమస్త మతధర్మముల నరసి యక్బరు రాజ్యపరిపాలనము సేయఁదొడఁగెను. ఇందులకు మూఢులు కొందఱత్యంతరము పెట్టిరి. వారిచి గ్రములఁ బ్రిప్పుటకీగవికి విశేషకాలము పట్టెను. సకలమత బోధకులతోడను, ఆయా మతంబులఁగూర్చి చర్యసేయు నిమిత్తమై ఫత్తేపూరుసిక్రియందొక విశాల భవనమును గట్టించెను. దీని పేరు "ఇబదత్ ఖానా", ఇందు బ్రతిగురువారమును మతసంబంధమైన సభలు జరుపఁబడుచుండును.

ఇట్టి సభలకు నాధిపత్యమక్బరే వహించుచుండును. ఈసభల కన్నిమతముల వారును రావచ్చును. నామములు వేరుగాని, యన్నిమతములకును, భగవంతుఁడొక్కఁడే గురి

యాత్రను గ్రహించెను. హిందువులను మహమ్మదీయులు బాధింపరాదని యాజ్ఞాపించెను. ఇతని సర్వమత సహనమే రాష్ట్రనిర్మాణమునకుఁ దోడయ్యెనని చెప్పవచ్చును. తనచే నోడింపఁబడిన రసపుత్రవీరులకున్నతోద్యోగముల నిచ్చి, వారితో సంబంధబాంధవ్యముల నెఱపుచువచ్చెను.

### రాజ్యపాలనము.

అక్బరుయొక్క అంతరంగిక సభలలో నన్నిమతముల వారు నుండిరి. సామంతరాజులందఱు నాతనికి విధేయులై యుండి, సామ్రాజ్యాభివృద్ధికై పాటుబడుచుండిరి. అక్బరు తన బుద్ధిబలముచే హిందూమహమ్మదీయ సమ్మేళనము గలిగించుటచే, భరతవర్షమునకుఁ బరదేశ దండయాత్రలవలన భయములేకుండెను.

### ఉద్యోగవర్గము.

భగవాన్ దాసు
వీరబలుఁడు
మానుసింగు
అబ్దుల్ రహీం
} సేనానాయకులు.

రాజాతోడర్ మాల్
అబుల్ ఫాజి
ఫయిజీ
బదాని — మొదలగువారు
} మంత్రులు — ఆస్థాన విద్వాంసులు.

ఇట్టి యుద్యోగబృందముతో నాయక్బరు " ధర్మమే జయ" మను వాక్యము ననుసరించి రాజ్యము పాలించెను.

ఆతని చట్టములు సర్వమతముల వారికి నొక్కటిరుగనే యుం
డెను. రాష్ట్రమంతయు 16 భాగములుగా విభజింపఁబడెను.
ఈప్రదేశములందు నక్బరుచే నియమింపఁబడిన ప్రతినిధులు,
శిస్తు వసూలుచేయుటకును, సందర్భుఁగలుగు కలహముల
నడంచుటకును నధికారము గలిగియుండిరి.

ఈతని ప్రభుత్వమున రణమున నోడిపోయినవారిని
బానిసలుగాఁ జేయు వ్యాపారమును, జిజియాయను హిందు
వులపై విధింపఁబడిన పన్నును మాన్పఁబడెను.

## సైన్యము.

మొత్తముమీఁద నక్బరునకు 12 లక్షల సైన్యముం
డెను. అయ్యది ఆయా సామంతరాజులయొద్దనుండును. అక్బరు
ఆజ్ఞయైనప్పుడు వారు సైన్యమును తోడుకొనిపోవలయును.
అక్బరున కితరులవలన భయమేమియుఁ గలుగదను ధైర్య
మునఁ గలిగినవాఁడగుటచేఁ దన రాష్ట్రమున నాయుధచట్టము
లేమియుఁ జేసియుండలేదు. ఈతని రాష్ట్రమున ఫిరంగులు,
తుపాకులు, ఖడ్గములుచేయు కార్ఖానాలుండెను. వీని నక్బరు
స్వయముగా తనిఖీచేయుచుండువాఁడు. ఈతఁడు ఫిరంగులను
జేయుట కొకవిధమయిన నూతనపద్ధతిని గనిపెట్టి యాప్రకా
రము చేయించుచుండెడివాఁడు.

## నాణెములు.

ఈతని పాలనమున బంగారు వెండి నాణెములు తయా
రు చేయింపఁబడి యుపయోగింపఁబడుచుండెను. ఆనాణెముల
మీఁద "దేవుఁడు సర్వోన్నతుఁడు, అతని మహిమ యమ్ము

తము" అని చెక్కఁబడియుండెడిది. ఈనాణెములుచేయు స్థల
ములకు టంకసాల యని పేరు. రాజాతోడర్ మాల్ టంక
సాలాధికారిగానుండెను.

### విద్యావ్యాప్తి—కళల అభివృద్ధి.

అక్బరు సకలవిద్యాప్రియుఁడు. ఇతని మందిరమున
నొక గొప్ప పుస్తకభాండాగారముండెను. గ్రంథపఠనమునం
దితనికి విసుగులేదు. ఇతఁడు తనభాషయందు మంచి పాండి
త్యము సంపాదించినాఁడు. అనేక గ్రంథములను వివిధభాషల
నుండి తర్జుమాచేయించెను. ఆ యాగ్రంథముల భాషాంతరీక
రించుటకు గొప్ప విద్వాంసు లేర్పఱుపఁబడియుండిరి. రామా
యణము, భారతము, అథర్వణవేదము, లీలావతీగణితము,
మొదలగు సద్గ్రంథముల భాషాంతరీకరింపఁజేసెను. తన
రాష్ట్రమున ప్రతిచోట విద్యాశాలల స్థాపించి, హిందువుల
కును, మహమ్మదీయులకును వలసిన విద్యల నేర్పునట్లుచేసి,
విద్యాభివృద్ధిఁ గావించెను. "అబుల్ ఫాజల్" అను నాస్థానకవి
"అయినీఅక్బరీ" యనుపేర నక్బరు చరిత్రమును విపులముగా
వ్రాసినాఁడు.

అక్బరుకాలమున నిప్పటివలె ముద్రాలయములు
లేవు. ఆకారణమున "తస్వీరుఖానా" యను నొక శాలను
స్థాపించి, యందుఁగవులచే వ్రాయఁబడిన గ్రంథములనేక
ప్రతుల వ్రాయించుటయు, నందు బాగుగ వ్రాసినవారికి
విశేషబహుమతి నిచ్చుచుండెడివాఁడు. అక్బరునకుఁ జిత్రపట
రచనమునందభిలాష మెండు. ఆకారణమునఁ జిత్రకారులలో

నగ్రిగాయ్యుఁడని ప్రసిద్ధిఁజెందిన "మీరాసయ్యదాలీ" యను
వానిచే భారత రామాయణములు మొదలగు పురాణములలో
నుండి కథలననువదించి, చిత్రపటములు వ్రాయించుటయే
గాక రెండు చిత్రశాలల స్థాపించి, యందును నేర్చుకొను
నట్లుచేసి చిత్రకారవిద్య వృద్ధిఁగావించెను.

ఈతఁడు శిల్పకళకు గూడ వృద్ధిసందించెను, విదేశముల
నుండి శిల్పులఁ దెప్పించి, యిచ్చటి శిల్పులు వారివిద్యను
నేర్చుకొనునట్లు చేసెను. పత్తేపూరు సిక్రియందు చిత్రము
లైయున భవనములఁ గట్టించెను. తన రాష్ట్రమునఁ బ్రతిగ్రామ
మునను సత్రములు, రోగులకు మందుల నుచితముగనిచ్చు
వైద్యశాలలు గట్టించెను.

### సంఘసంస్కారణము.

ఈతఁడు చేసిన సంఘసంస్కారములఁ గొన్నియుల్లేఖిం
పవలయును. అందు ముఖ్యముగ వివాహసంబంధమైనవి కొన్ని
కలవు. పసితనములో ననేకవ్యాధి రోగములేర్పడి గష్టములు
పుట్టుచున్నవని, వ్యక్తులుగానివారికి పెండ్లిండ్లు జరుపుట
పాపమనియు, వధూవరుల సమ్మతిలేని దీసికొని వివాహములు
సేయుట ధర్మమని బోధించెను. రజస్వలానంతర వివాహ
ములు చేయవచ్చునని యీతఁడు చట్టమేర్పఱచెను. ఈతఁడు
రాజ్యపరిపాలనాభారము బూనుటకుఁ బూర్వము మహమ్మ
దీయ శాస్త్రమునననుసరించి, పినతండ్రి పెదతండ్రి కుమా
రుల వివాహము చేసికొను నాచారముకలదు. అట్టివివా
హములు కూడదని చట్టము చేసెను.

భర్త మరణింపఁగా భార్యగూడ నాచితిం బ్రవేశించి ప్రాణముల వాయునాచారము (సహగమనము) అను పేర నున్నది. ఈయాచారమును మాన్పుట కక్బరతి ప్రయత్నము చేసెను. కాని, యిది యెక్కువగ రసపుత్రస్థానమున నుండుటచేతను, రాజపుత్రులాతనికి ముఖ్యహితులై యుండుటచేతను కొంత వెనుదీసెను. కాని, క్రమక్రమముగా దాని నాపెను. వితంతు వివాహములు శాస్త్రసమ్మతమని యాతఁడు శాసించెను. తన రాష్ట్రమున దేవతలకు జంతువులను బలికొనంగ రాదని కఠినమైన యుత్తరవు లిచ్చెను.

అక్బరునకెనమండుగురు భార్యలు. అందిరువురు రాజపుత్రవనితలు. ఇందూజోధాబాయి బట్టపుదేవి. ఈమెయే జహాంగీరు (సలీము) తల్లి.

ఇట్లు తన బుద్ధిబలముచే రాష్ట్ర నిర్మాణమొనర్చి జాతిమైక్యత నెలకొలిపి, సర్వజనులచే శ్లాఘింపఁబడి, 49 సంవత్సరములు ధర్మసంధుఁడై ఢిల్లీసామ్రాజ్యము పాలించిన యాయక్బరు చక్రవర్తి ఆగ్రాపట్టణమున 1605 సంవత్సరమున అక్టోబరు 16 తేదిని స్వర్గస్థుఁడయ్యెను.



# 4. శివాజి.

బీజాపూరు మహమ్మదీయ సైన్యమునం దొక్క ముఖ్యుఁడుగనుండిన మహారాష్ట్రవంశజుఁడగు షాజీయనువానికి, జిజా



బాయియను సాధ్వియందు, శివాజీ— శాలివాహనశకము 1549 అక్షయసంవత్సర వైశాఖశుద్ధపంచమి (క్రీ. శ. మే

1627) నాఁడు జన్మించెను. షాజీ జిజాబాయియను భార్యనే గాక బీజాపూరున మహారాష్ట్ర ప్రముఖుఁడగు మోహితే వంశస్థుని కూతురయిన తుకాబాయినిగూడ వివాహమాడెను. షాజీ తన పెద్దకుమారుఁడగు శంభాజీతోడను, రెండవ భార్య తోడను బీజపూరునందే కాపురముండెను. ఆకారణముగఁ దన తండ్రియగు లుకోజీజాధవుఁడు శతృవులచేఁ జంపఁబడె నను కోపముచేతను, తన భర్త మరల వివాహము జేసికొనె నను కోపముచేతను, జిజాబాయి కుమారుఁడగు శివాజీతో వైజాపూరను గ్రామముననుండెను.

షాజీ బీజాపూరు సైన్యములో ముఖ్యుఁడుగానుండిన కారణమువలన, నాతని సర్వస్వము హరించుటకు, మొగలులకు వశవర్తియై, దౌలతాబాదు ముట్టడి జరుపుచున్న మహాబల్ ఖానుఁడు, షాజీకుటుంబమును బట్టి యిచ్చినవారియెడలఁ జాగ్రత్త విశేషముగ దయఁజూపునని తెలుప, మొగలు సర్దారుఁడగు మాల్గామఖానుఁడు వైజాపూరునందున్న శివాజీ జిజాబాయి లను బట్టుకొని మహాబల్ ఖానునకప్పగించెను. కాని, మొగలు సైన్యముననున్న జిజాబాయి బాంధవుఁడొకఁడు మహాబల్ ఖానునితో—నామెను షాజీవిడిచిపెట్టి, వేఱొక వివాహము జేసికొనెననియు, నాతని రక్షణములో నామె లేదనియుఁ జెప్పి విడిపించి, వారిని 1688 సంవత్సరమున కొండనేరుదుర్గము నకుఁ బంపివేసెను. శివాజీ యప్పుడాఱుసంవత్సరముల వయ స్సుననుండెను.

శివాజీకి పదిసంవత్సరముల వయస్సున జీజాబాయి యాతనిని వెంటఁబెట్టుకొని, బీజాపూరునకున్న పతికడ కేగెను. కాని, వారిరువురు నచ్చట విశేషకాలముండలేదు. జగపాల్‌రావునింబాల్కరు మనుమరాలగు సయీబాయిని శివాజీకి వివాహమొనర్చిన పిమ్మట, శివాజియుఁ దల్లియు—పూనా యందు దాదోజీకొండదేవుఁడను బ్రాహ్మణుని రక్షణము క్రిందనుండిరి. దాదోజీకొండదేవుఁడు పూనా జాగీరునుజూచు టకు షాజిచే నియమింపఁబడిన కార్యకర్త (గుమాస్తా) యుండెను.

### శివాజీయొక్క మహోద్యమము.

అంతకుమున్ను వలసిన ధనముగాని, రాజ్యముగాని లేక, స్వశక్తిని వినియోగపఱచి, మహమ్మదీయులకుఁ బ్రక్క లో బల్లెమై మహారాష్ట్రరాజ్యసంస్థాపకుఁడై దశదిగ్భాగముల యందును తన కీర్తిచంద్రికల గాయించిన మహాపురుషుఁడే శివాజీ.

పూనాయందు దాదోజీకొండదేవుఁడు శివాజీకి మహా రాష్ట్రకుమారుల కవసరమైన విద్యలన్నియు నేర్పెను. శివాజీ వ్రాయుటయందును, చదువుటయందును, విశేషకౌశలము నార్జింపలేకపోయినను, అశ్వారోహణమందును, శస్త్రవిద్య యందును నారితేరినవాఁడయ్యెను. రాజకీయవ్యవహారముల యొక్కయు, మతసాంఘికవిషయములయొక్కయు సంగతుల గ్రహించుటయందును, విచారించుటయందును నాతనికి మిగు ల సమర్థత కలిగియుండెను. ఏదియో మహాకార్యమునకే ము

టకుఁ దన్ను భగవంతుఁడు పుట్టించెననియు, నట్టి కార్యము చేసి లోకమునఁ గీర్తిఁ బొందవలయుననియు నాతఁడు నిరంతరము భావించుచుండెను. సాధారణముగా మానవులట్టిస్థితియందున్నను వారికి ధైర్యము నిచ్చునది లోకవిజ్ఞానమే. అట్టి విజ్ఞానము శివాజీకి దాదోజీకొండదేవుని వలన గలిగెను.

శివాజీ పదియాఱు సంవత్సరముల వయస్సునుండియు స్వాతంత్ర్యమును గూర్చి ప్రశంసించుచుఁ దన శక్తిసామర్థ్యములు లోకమున వెల్లడిచేయ యత్నించుచుండెను. అతఁడు తన తల్లియగు జిజాబాయియందు వర్ణనాతీతమైన భక్తి గలిగియుండెను. ఆమె రామాయణ మహాభారతములలోని శౌర్యసాహసక్రియాకథలతో నితని చిత్తమును నిరంతరము నుప్పొంగఁజేయుచుండెను. మతాభిమానము—దేశభక్తి—శౌర్యసాహసములు—నితని ఉగ్గుపాలతోఁ బెట్టబడెనని చెప్పవచ్చును. శివాజీ వృద్ధిలోనికి వచ్చుటకు దాదోజీకొండదేవుఁడే కారణుఁడు. శివాజీ తన తండ్రియగు షాజీయొద్దనున్నచో నట్టి పరమానురాగమును జూపకుండునో, కొండదేవుఁ డాతని మొదల నట్టి పరమానురాగమును జూపించుచుఁ బ్రతికార్యము నెఱవేర్చుటయందు సమర్థునిగాఁ జేసెను. దాదాజీ యతనికి సామదానభేదదండోపాయసమన్వితమగు యుద్ధనీతియు, రాజ్యపరిపాలనావిధానమును సమగ్రముగ నేర్పెను. శివాజీని మహామ్మదీయసైన్యములలో నొక ముఖ్యునిగ జేయవలయునని దాదాజీయుద్దేశమైయుండెను. కాని, శివాజీకి మాత్రమట్టి

మహోద్యమమునకు సంతసించుచు నాతనికుత్సాహము గలిగించుచుండిరి. మఱికొందఱు మహారాష్ట్ర యౌవనవీరులితనికిఁ దోడ్పడిరి. అతఁడు బుద్ధికౌశల్యముచే మావలీలందఱును దనయాజ్ఞకు బద్ధులైయుండునట్లు చేసికొనెను. ధర్మసంస్థాపనాశక్తియు, నిశ్చలమనోబలమును, విపులమంత్రోపాయములును యదార్థదేశాభిమానమును, శివాజీ యుద్యమమునకుఁ దోడ్పడెను. అతఁడే కార్యముఁ జేయఁదలఁచినను దల్లి యాశీర్వచనముగ్గొని చేయుచుండెడివాఁడు. స్వతంత్రశక్తిబీజమాతని మనఃక్షేత్రమున నామెయే నాటినది. అతనిపాలిటి కామెయే భవానీదేవిగనుండెను.

శివాజీ చిత్తము రాజ్యస్థాపనవిషయమందు, బ్రా---నెను. అనేకులాతనికిఁ దోడునీడలైనిలిచిరి. ఇక నాతఁడావిషయమునఁ గృషిఁ జేయఁదొడఁగెను. మహమ్మదీయ రాజ్యములలోఁ గొండదుర్గములు సాధారణముగ నశ్రద్ధగఁ జూడఁబడుచుండెను. మహమ్మదీయ చక్రవర్తులాదుర్గముల పాలనము కిల్లేదారులపై పెట్టుచుండిరి. పూనాకుఁ బండ్రెండుమైళ్లదూరమున కొండనే (సింహగడ) యను దుర్గమొకటి కలదు. దానికాగ్నేయమూల పురందర దుర్గమున్నది. ఈదుర్గము నీలకంఠ రావను బ్రాహ్మణుని యాధీనముననుండెను.

ఈయిద్దఱు దుర్గసంరక్షకులతోడను శివాజీ మిగుల స్నేహముగనుండెను. అందు ముఖ్యముగ నీలకంఠరావుతో నెక్కువమైత్రి కలిగియుండెను. మావలీలలో ముఖ్యులగు యశాజీకంకు, తానాజీమాలుసరే, బాజీఫసల్కరు, అను

ముగ్గురు శివాజీకి ముఖ్యస్నేహితులై యుండిరి. సింహగడకు నెనిమిది మైళ్లదూరమున నున్న తోరణకోట కిల్లేదారుతో నుత్తరప్రత్యుత్తరములు జరపి, కృత్రిమ సమరము సలిపి, శివాజీ యాకోటను దనవశము జేసికొనెను. తోరణకోట ముట్టడికాలమున కతనివయస్సు పందొమ్మిది సంవత్సరములు. శివాజియొక్క రాజకీయ జీవితమిప్పటినుండియే ప్రారంభమైన దని చెప్పవచ్చును.

## రాజకీయ జీవితము.

శివాజీ తోరణకోటనుబట్టుకొని యందులోఁ గొంత భాగమును ద్రవ్వఁచుండఁగా భవానీదేవి యనుగ్రహమునఁ గొంత ద్రవ్యము దొరికెను. అధనముతో నతఁడు రాజగడ యను కోటను బాగుచేయించి, దానిని దన నివాసముగా నేర్పఱచుకొనెను. బీజాపూరు వారిదియంతయుఁ జూచి, కుటుంబ సంరక్షణార్థమై యాకోటలు శివాజిచేఁ బట్టుకొనఁబడినవని తలఁచి సంతృప్తిఁ బొందిరి. శివాజీ జాగీరులో ఫిరంగోజీనర్సాలా యనునతఁడును, షాజీ రెండవభార్యయగు తుకాబాయి సోదరుఁడైన బాజిమోహితేయనునతఁడును గలరు. రెండవవాఁడు సోపాజిల్లాపై నధికారిగనుండెను. వీరిరువురును శివాజీ యభిప్రాయము ననుసరించి వర్తింపలేదు. శివాజీ మొట్ట ఫిరంగోజీకి లంచమిచ్చి యాతని యధికారమునందున్న చాకను కోటను వశముచేసికొని, యధికారమాతనికేయుంచి, చుట్టుప్రక్కలనున్న శిస్తుగూడ వసూలుచేయు నుద్యోగమతనికిచ్చి తన సేవకునిగఁ జేసికొనెను. బాజిమోహితే షాజీ యాజ్ఞ

లేని యాయధికారమును లక్ష్యముసేయకుండుటచేత శివాజీ యొకనాటియర్ధరాత్రి సమయమునఁ దన మావళీలతోఁ బోయి కోటను ముట్టడించి, మోహితేని యనుచరులతోఁ గూడ బంధించి, యాసమయమునఁ గర్నాటకమున నున్న తన తండ్రి యొద్దకుఁ బంపెను. తరువాత కొండనే దుర్గరక్షకుఁడైన యొక మహమ్మదీయునకు లంచమిచ్చి యాకోటను వశముచేసికొనెను. దీనికి నతఁడు సింహగడమను క్రొత్తపేరు పెట్టెను. ఈ కోటలన్నియు శివాజీ తన బుద్ధికుశలతచేత నార్జించెనుగాని రక్తపాతముగాని, యితరులకు బాధగాని కలుగఁజేయలేదు.

ఇప్పటికతనికి జాగీరు పూనా—సోపా—బారామతి యిందుపూరాదులకును వ్యాపించియుండెను. పురందరుకోట పూనాకును బారామతికిని పోవు మార్గమున నుండుటచే దానిఁగూడ బట్టుకొనుటకు శివాజీ కవసరమయ్యెను. ఈకోట కధికారియగు నీలకంఠరావు మరణించిన పిమ్మట నాతని పుత్రులు కలహించి శివాజీని తగవుదీర్పుమని కోరిరి. అతఁడు వారిని బంధించి దుర్గమును దన స్వాధీనముఁ జేసికొనెను. తరువాత నతఁడు వారికిఁ గొన్ని యీనాములిచ్చెను. చాకను దుర్గమునకును నీరానదికిని మధ్యనున్న దేశమును శివాజీ యనాయాసముగ నార్జించెను. కొండలపైఁ జరించుచు, మెల్ల మెల్లగఁ బ్రోగుచు నాహారముకై గంతులువేయు సింగము వలె శివాజీ తలఁచిన కార్యము కొనసాగువఱకును నాతని చిత్తమెవ్వరికిని తెలియక యుండెను. శత్రువుల చేతను, సమూహములచేతను జుట్టుకొనఁబడి యుండి, స్వశక్తిచే నార్జిం

చిన చిన్న రాజ్యము గలిగియుండిన శివాజీ, పరశేశాగ్రి యము
గామునకుఁ గడంగెను. మావళీలందఱును వరిని యధీనములై
యుండిరి. ఇట్లుండఁ గల్యాణదుర్గపరిపాలకునివలన బీజపూరునకుఁ విస్తార
ధనముపంపఁబడుచున్నదని తెలిసికొని, శివాజీ మావళీలతోఁ దారిఁ
గాచి, యాధనరక్షకులఁ బాఱఁదోలి, ధనమును గుఱ్ఱముల
మీఁద వేయించి రాజగృహమునకుఁ బంపెను. ఈ వార్త బీజపూరు
నకుఁ జేరకమునుపే, యాతఁడింకను కొన్ని దుర్గములస్వాధీనము
జేసికొనెను. ఇదియుంగాక దాదాజీసోనదేవుఁడు కల్యాణ దుర్గ
మును జయించి, యాదుర్గపరిపాలకునియాధీనమునన్న కోటల
ను స్వాధీనముజేసికొనెను. శివాజీ యావార్తవిని యత్యుటికరిగి
యాప్రాంతమునకు సోనదేవుని రక్షకునిగా నేర్పఱచెను. ఈ
సందర్భముననే బంధింపఁబడిన కల్యాణ దుర్గపరిపాలకుఁడగు
మూలమహమ్మదుయొక్క కోడలిని జూచి "మాతల్లీ! నీసౌం
దర్యమున్న యెడల నేనెంత యదృష్టవంతుఁడనై యుండెడి
వాఁడను. నేనుగూడ నెంతటి సౌందర్యవంతుఁడనై యుండెడి
వాడ" నని పలికి, శివాజీ యామెను గౌరవముగా బీజపూరు
నకుఁ బంపివేసెను.

బీజపూరు సుల్తానగు మహమ్మద్ అదిల్ శాహి యిది
యంతయు విని షాజీప్రోత్సాహముచే జరుగుచుండెనని యను
మానమందెను. బాజీఘోరేపురేయను నాతఁడాకాలమునఁ
గర్నాటకమునందు షాజీతోఁగలిసి పని జేయుచుండెను. షాజీని
మాయోపాయమునఁ బట్టుకొని ఖైదుచేయుమని సుల్తాను ఘో
రేపురేకు రహస్యముగ వార్తబంపెను. ఘోరేపురే షాజీ

పిందుకుపిలిచి, బంధించి, బీజపూరునకుఁ బంపెను. శివాజీ తన మాటవినఁడని, షాజీ యెంతచెప్పినను సుల్తాను వినలేదు. ఆసమయమున నెట్లయినఁ దండ్రిని చెఱనుండి విముక్తునిఁ జేయ వలయునని తలంచి, మొగలు సేవకుఁడనగుదుననియు, నహమ్మదు నగరరాజ్యమునందు చౌతు సర్దేసముఖులు తనకు వారసత్వము గలవనియు, మొదలగు విషయములతో శివాజీ షాజహానునితో రాయబారము నడపెను. షాజహాను శివాజీని 5000 గుఱ్ఱపుదళమునకు మున్సబుదారునిగఁ జేసి, షాజీని వెంటనే విడిచిపెట్టుమని బీజపూరు సుల్తానునకు త్తర్వుఁ జేసెను. బీజపూరుసుల్తాను మొగలులు తనపైకి దండెత్తివత్తురను భయముచేతను, నింతకుమున్ను శివాజీ పట్టుకొన్నకోటలు మొగలుల కిచ్చివేయునను భయముచేతను, షాజీని విడిచి బీజపూరునందుండునట్లు చేసెను. కొన్నాళ్లకుఁ గర్ణాటకమున నల్లరు లెక్కువయగుటంజేసి, సుల్తాను షాజీని యతని జాగీరునకుఁ బంపెను. షాజీ కర్ణాటకమును జేరి "నీవు నాకుమారుఁడవైనచో బాజీఘోరేపురేను శిక్షింపవలయు" నని పుత్రుఁడగు శివాజీకి నుత్తరము వ్రాసెను. శివాజీ తండ్రియాజ్ఞనెఱవేర్చెను.

కర్ణాటకమునందల్లరులు తగ్గలేదు. బీజపూరు సైన్యములోఁ జాలభాగమాతనిమీఁద నుండెను. షాజీ పెద్దకుమారుఁడగు శంభాజీ కనకగిరికోట ముట్టడిసమయమున హతుఁడయ్యెను. ఆతని మరణమునకు నప్జల్ ఖానను నతఁడు కారణుఁడని యొక వదంతికలదు. బీజపూరు వారిదృష్టి కర్ణాట

కము విరోధనేయుండి శివాజిని చూచుచుండిరి. దీనికిఁ దోడు ఔరంగజేబు దక్కనునకు యువరాజుగాఁ బంపఁబడెను. ఏకారణమైనఁ గల్పించుకొని బీజాపూరు గోల్కొండల నితఁడు జయింపఁదలఁచి, తండ్రియొద్దనుండి యాజ్ఞఁ దెప్పించుకొని 1655 సంవత్సరాంతమున యుద్ధసన్నద్ధుఁడాయెను. ఈసమయమున శివాజీ తన జాగీరు చుట్టుప్రక్కలనున్న మహారాష్ట్ర ప్రముఖుల నయముచేతను, భయముచేతనుగూడఁ గట్టుకొని వచ్చినట్టి బీజాపూరు సేనయందున్న జాగీరుదార్లనుగూడ తన ప్రయత్నములోనికి వచ్చునట్లు యత్నించెను. తరువాత శివాజీ లోహిడాకోటను బట్టుకొనెను. నూతనముగఁ దానార్జించిన దేశము బలపఱచుటకుఁ గృష్ణానది యుత్పత్తిస్థానమగు మహాబలేశ్వరముకొద్ద నొకకోటను దిట్టముగాఁ గట్టించుటకు మహారాష్ట్ర వీరుఁడగు మోరేపంతు పింగలేను నియమించెను. అదియే ప్రతాపగడయను పేరఁబరఁగెను.

బీజాపూరు గోల్కొండలు కలవరమందుచుండెను. ఔరంగజేబు తండ్రి యాజ్ఞనుబొంది గోల్కొండపై దాడివెడలెను. గోల్కొండ సుల్తాను భయమంది సంధికై వేడెను. మొదట ఔరంగజేబు సమ్మతింపలేదు గాని తుదకెన్నియో కష్టములైన సమాధానములతోఁ దృప్తినొందెను. 1657 సంవత్సరములో ఔరంగజేబు బీజాపూరును జయించుటకు వెడలెను. ఇంతలో నతనితండ్రియగు షాజహాను రోగపీడితుఁడగుటచేతను, పెద్దకుమారుఁడగు దారా రాజ్యము నాక్రమించుకొనునట్లు తెలియవచ్చుటచేతను, బీజాపూరుతో [illegible]

సంధిఁ జేసికొని, యౌరంగజేబు ఢిల్లీకి వెడలెను. ఈచరిత్రము
లన్నియు శివాజీ ప్రక్కప్రక్కలనుండి చూచుచుండెను.
ఔరంగజేబు గోలుకొండ కరిగిన సమయమున శివాజీ సఖ్యము
గోరినవానివలె నటించుచుండెను. శివాజీయు నట్లేయుండి
కొంకణప్రాంతమును వశము చేసికొనుచుండెను. ఔరంగజేబు
బీజపూరుమీఁదికి దాడివెడలినపుడు శివాజీ జూనారు అను పట్ట
ణమునకుఁబోయి దానిని కొల్లవెట్టి కావలసినంత భాగ్యము
రాజగడకుఁ జేర్చెను. ఇదియే యాతఁడు మొగలులతోఁ జేసిన
ప్రథమకలహము. కాని, బీజపూరు ఔరంగజేబునకు లోబడు
చున్నదని తెలిసికొని, శివాజీ యాతనితో నక్కవినయమునఁ
గాలము గడపనెంచి, రఘునాథపంతను నొక వకీలును రాయ
బారిగాఁ బంపెను. ఔరంగజేబును నేవో కొన్ని మాటలు చెప్పి
యుండుటకు సమ్మతించినట్లు శివాజీకి యుత్తరము వ్రాసెను.
తమ రాయబారముల కెవ్వరును మోసపోవక యాయిరువు
రును దమ యిచ్చవచ్చిన యాలోచనలఁ జేయుచుండిరి. సము
ద్రతీరమున నున్న పెక్కుదుర్గములు శివాజీచే నాక్రమించు
కొనఁబడినవి. ఆస్థలముల యందోడలఁ దోచుకొనుటకు
శివాజీ నావసైన్యమునుగూడఁ జేర్చెను.

## అఫ్జల్ ఖానుని వధ.

శివాజీయొక్క విజయములు బీజపూరువారికి గొప్ప
యుపద్రవములకుఁ గారణములగుచుండెను. ఇఁక నూరకుండిన
లాభములేదని బీజపూరున రాజకార్యధురంధరుఁడని ప్రసిద్ధి
కెక్కిన యఫ్జల్ ఖానుఁడు "శివాజీని ప్రాణములతోడనే పట్టి

తెచ్చెదను. లేకున్నం బ్రాణములం దీసెద"నని ప్రతిజ్ఞం జేసెను. 1659 సంవత్సరమున అఫ్జుల్ ఖానుండు, తుల్జాపురము పురంధరపురములమీదుగ బయలుదేరి, యాపురములలోనుండు భవానిదేవి యాలయమును, పాండురంగదేవాలయమును పాడుచేసి విగ్రహములను బగులంగొట్టించెను. అతని దండయాత్ర కేవలము మతవిద్వేషమైన రూపముదాల్చియుండెను. అఫ్జుల్ ఖానుని రాక విని శివాజి ప్రతాపగడము చేరెను. ఒకరినొకరు పట్టుకొనవలయునని వ్యూహములం బన్నుచుండిరి.

ఎట్టికార్యము చేయవలసివచ్చినప్పుడైనను శివాజి భవానీదేవిని ధ్యానించి, యామెయాజ్ఞననుసరించి చేయుచుండును. భవానీదేవి యనుగ్రహమువలనను, దల్లి యాశీర్వచన బలమువలనను, నాతండఫ్జుల్ ఖానునొంటరిగ నెదుర్కొనందలంచెను. తాను లోబడువాని చందమున నామహమ్మదీయున కాతండెన్నో వార్తలంబంపెను. అఫ్జుల్ ఖానుండందులకు సంతోషించి, పంతోజిగోపీనాథుండను వానిని శివాజియొద్దకు రాయబారిగాంబంపెను. శివాజి యారాయబారికిని, నతనితోవచ్చిన వారికిని దగిన బసలేర్పఱచి, యాదినమున నర్ధరాత్రి సమయమున బ్రాహ్మణవేషమున పంతోజియొద్దకరిగి "నేను చేయు కార్యమంతయు గోబ్రాహ్మణ సంరక్షణార్థమైయున్నది. భవానీదేవివలన నేనిట్లాజ్ఞాపింపంబడితి" నని పలికి యాతని సహాయము వేడికొనెను. పంతోజి యందులకు సమ్మతించి, వాయీయనుస్థలమున విడిచియున్న యఫ్జుల్ ఖానునిచేరి. శివాజి భయపడుచున్నాడనియు, నీవు స్వయముగ నరిగి,

క్షమించితినని చెప్పినచో నాతఁడు భయముడిగి లోబడునని యుఁ జెప్పెను. ఖానుఁడందులకు సమ్మతించి, శివాజీ తన్నుఁ గలసికొనుటకుఁ బ్రతాపగడకోట సమీపమున నొక స్థలము నేర్పాటుచేసెను. ఖానుఁడు వచ్చుమార్గమున వృక్షములన్నియు గొట్టివేయఁబడి మార్గము పరిశుభ్రముగఁ జేయఁబడెను. శివాజీ కొంతమంది నాయామూలలయందు నిలిపి వారికిఁ గొన్ని రహస్యములఁ దెలిపెను.

అఫజల్ ఖానుని సైన్యము ప్రతాపగడకోటకుఁ గొంత దూరమునవచ్చి నిలచియుండెను. అఫజల్ ఖానుఁ డొక్క యనుచరునితో మాత్రము వచ్చి, నియమితస్థలమును జేరి, శివాజీరాక కెదురుజూచుచుండెను. అంతట శివాజీ భవానీ దేవిని దలఁచుకొని, తల్లి యాశీస్సుగైకొని, లోహకవచమును, లోహకిరీటమును ధరించి, అంగరఖా కుడిచేయియందు బిచ్వా యను పేరుగల యాయుధమును దాచుకొని, తానాజి మాలుసూరే యను వీరాగ్రేసరుని వెంటఁబెట్టుకొని, మిగుల భయమందినవానివలె నటించుచు, నిటునటు జూచుచు, నఫజల్ ఖానుని సమీపించెను. అఫజల్ ఖానుఁడు శివాజీ నాలింగనము జేసికొను సమయమున, శివాజీ తాను దాచియుంచిన చిన్నఖడ్గముతో ఖానునిఁ బొడిచెను. ఖానుఁడు మరల ఖడ్గమెత్తెనుగాని శివాజి తప్పించుకొనెను. సవారీబోయీలు పడియున్న ఖానుని పల్లకిలోఁ బెట్టుకొని పోవుచుండ, దూరమునఁ దాగియున్న మహారాష్ట్రవీరులా ఖానుని శిరము ఖండించి, విజయచిహ్నముగ దానిని బ్రతాపగడమునకుఁ గొనిపోయిరి.

మహారాష్ట్రసైన్యము బీజాపూరుసైన్యముపైఁబడి చెండాడెను.
శివాజీకి యీయుద్ధములో నపరిమితధనమును, నశ్వములును
దొరికెను. యుద్ధమునఁ బాఱిపోయిన తురుష్కులు కొంద
అడవులఁబట్టి తిరుగుచుండ, మహారాష్ట్రులు వారిం బట్టుకొని
శివాజీముందుఁబెట్టిరి. శివాజీ వారి కెగ్గుచేయక వారిని
దగువిధమున సత్కరించి పంపివేసెను.

దీనితరువాత శివాజీ క్రమక్రమముగా ననేక దుర్గము
లను వశము చేసికొనెను. అందు కెల్నాయను దుర్గమునకతఁడు
విశాలగడయను పేరుపెట్టెను. పన్హాలాదుర్గము ముట్టడియందీ
తఁడు మహమ్మదీయులతో నతిఘోరముగఁ బోరాడెను.
ఈసమయమునందే—ఇతని తండ్రికపకారము చేసిన బాజీ
ఘోరపడేను వధించి, పితృవాక్య పరిపాలకుఁడయ్యెను. అనే
కులు వచ్చి శివాజీ నాశ్రితులయిరి. ఇంచుమించుగాఁ గొంక
ణమంతయు స్వాధీనమైనపిమ్మట, శివాజీ నౌకాసైన్యమును
గూడ సిద్ధముచేసి, బొంబాయికి నించుక దూరముననున్న
కొలంబాను బాగుచేయించి, దానిని దన నావికాసైన్యము
నకుఁ బ్రధానస్థానముగఁ జేసెను. అనేకస్థలములందు నావలను
జేయింప మొదలుపెట్టెను. ఈనావలతో నాతఁడు సముద్ర
ముపై వచ్చునోడలను దోచనారంభించెను. పోర్చుగీసువారి
తనికి భీతిల్లి మందుగుండుసామానుల నిచ్చుపద్ధతిమీద సంధి
చేసికొనిరి.

మహారాష్ట్ర వీరులందఱును వశులైయుండ, నీతఁడు
భూమిమీదను సముద్రముమీదను గూడ బలపరాక్రమవం

తుఁడై విజృంభించి చరించుచు బీజపూరువారికిఁ బ్రక్కలో
బల్లెమైయుండెను. ఆసమయమున షాజీ బీజపూరుసుల్తానుని
యాజ్ఞఁబొంది, కుమారుని జూడవచ్చి, కొన్ని దినములుండి,
మరల బీజపూరునకరిగెను. శివాజీ తనతండ్రి వాక్యము నను
సరించి తన రాజధానిని రాజగడనుండి రాయరీదుర్గమునకు
మార్చి, యచ్చట దన కచేరులును, నుద్యోగస్థులకు భవనము
లును గట్టించెను.

శివాజీయొక్క పరాక్రమ విజృంభణమునకు అవురంగ
జేబు సహింపఁజాలక షైస్తఖానుఁడను మొగలాయివీరుని నతని
శిక్షించుటకుఁ బంపెను. ఇందు షైస్తఖానుఁడు సంపూర్ణమైన
పరాభవమునందెను. శివాజీకప్పుడు ముప్పదియేడు సంవత్సర
ముల వయస్సుండెను. విశేష విద్యావంతుఁడు గాకపోయినను
రణరంగమునందును, రాజ్యతంత్రమునందును నపరిమితజ్ఞాన
ముఁజూపుచు బీజపూరు ఢిల్లీపాదుషాలను గజగజ వడకించు
చుండెను. సామాన్య జాగీరుదారుని కుమారుఁడైన యాతఁడు
స్వశక్తిచే ననేక దుర్గములాక్రమించి యొక రాజ్యముస్థాపించి,
ఛత్రపతియై విలసిల్లెను. మతద్వేషమను మాటలేక హిందు
వులను, మహమ్మదీయులను నాతఁడు సమదృష్టిగఁజూచుచుం
డెను. ఆతఁడు తన పరిపాలనము జనులకు రామరాజ్యమును
జ్ఞప్తిఁదెచ్చెను. ఒక సమయమున నీతఁడు తన రాజ్యమం
తయుఁ బ్రసిద్ధసిద్ధపురుషుఁడైన రామదాసునకు ధారవోసి
యాతని కోరికపై మరలఁగైకొనెను.

ఇతఁడు మొగలులతో పెక్కు యుద్ధములు చేసెను. ఒక సమయమున నీతఁడు ఢిల్లీయందు ఔరంగజేబుచేఁ జెఱఁ బెట్టఁబడి, మాయోపాయమునఁ దప్పించుకొనెను. ఇంతకు మున్ను శివాజీచేఁ గైకొనఁబడిన కోటలుకొన్ని మొగలుల స్వాధీనమయ్యెను. కాని, వానినోడ్చి శివాజీ యుపేక్షగ నుండలేదు. ఇంతవఱకు "కొండయెలుక" యని యౌరంగ జేబుచేఁ బిలువఁబడుచున్న శివాజీ, నేఁడు బీజాపూరు గోలకొండ సుల్తానులకును, ఢిల్లీమయూరసింహాసనాసీనుఁడగు నౌరంగ జేబునకును సింగమువంటి వాఁడయ్యెను.

ఒక సమయమున మొగలులాతనితో సంధిఁ జేసికొనిరి, కాని, మరల నౌరంగజేబు శివాజీని సాధింపఁదలఁచెను. గంత్రి ములలో నొకరిదించినవారు కారు. ఒకరికొకరు వంచించుటకుఁ బ్రయత్నములు సేయుచునే యుండిరి. శివాజి తన నామము తో నాణెముల నచ్చొత్తించి, మహారాజనామమును ధరిం చెను. ఇఁకఁ దన స్వతంత్రతనుఁ బ్రకటింపఁదలఁచి, కాశీ నుండి గంగాభట్టను పండితుని రావించి యథావిధిగ 1674 సం వత్సరము జూను 6 తారీఖునఁ బట్టాభిషిక్తుఁడయ్యెను. నాఁడు జిజాబాయికోర్కెలు సఫలతనందెననియు, నేఁడు విక్రాంతవీర మాతనైతిననియు సంతసించెను. శివాజీ పట్టాభిషిక్తుఁడైన పక్షము దినములలోనే యాతనితల్లి దివంబలంకరించెను. పట్టాభిషేకసమయమున నాతఁడు రాజ్యవిషయమై యనేక మంత్రివర్గములను, అష్టప్రధానులను నేర్పఱచి "క్షత్రియ కులావతంస ఛత్రపతి శివాజి" యను పేర వెలసెను.

ఇట్లు షాజీ జిజాబాయిలకు జన్మించి భూసురోత్తముఁడైన దాదాజీకొండదేవుని వలన శిక్షితుఁడై, స్వబుద్ధిచే రాష్ట్రనిర్మాణకర్తయై, ధర్మసాధుఁడై, పరమేశ్వర సేవకుఁడై—భారతీయులకెల్లర నిరంతర స్మరణీయుఁడై యాశివాజీ 1680 సంవత్సరము, ఏప్రియల్ 5 తేదిని—53 సంవత్సరముల వయస్సున స్వర్గస్థుఁడయ్యెను.



# ౫. శ్రీకృష్ణదేవరాయలు.

కృష్ణదేవరాయల పూర్వులను గురించి విశేషముగఁ జెప్పుట కాతఁడు రచించిన యాముక్తమాల్యదకంటె మఱియొక దృఢమైన యాధారము కానఁబడదు. కృష్ణదేవరాయల ముత్తాత కాలముననో మఱియెప్పుడో యీతని వంశమువారు



తుళువదేశమునుండి యాంధ్రదేశమును బ్రవేశించి యుందురు. మొదట కర్ణాటులయ్యును నాంధ్రదేశమును జొచ్చి యుందు క్రమక్రమముగాఁ నార్జించి యాంధ్రులతో సంబంధములు గల్పించుకొని, యాంధ్రులైరనుటకు సందియములేదు.

భరతవర్షమున నుతికెక్కిన హైందవ రాష్ట్రముల యందు, విజయనగర రాజ్య మగ్రస్థానమునధిష్ఠించి యుండెనని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ఢిల్లీసురుష్కులు కాకతీయాంధ్ర సామ్రాజ్యలక్ష్మి నస్తమింపఁజేసినప్పుడు, ఆయా స్థానముననున్న హరిహరరాయలు—బుక్కరాయలు—అను సోదరు లోరుగంటిసీమను విడిచి తెంచ్చుటనైన నొక చిన్న రాజ్యమును స్థాపింపఁగలిగిరి, పంపానదీతీరమున కరుదెంచి, విద్యానగరమును నిర్మించి దానిని రాజధానీపురముగఁ జేసికొనిరి. కాలక్రమమున నది యభివృద్ధిఁ జెందెను. ఇదియే విజయనగరసామ్రాజ్యము. ఈవిజయనగరసామ్రాజ్య మించు మించుగ 250 సంవత్సరములవఱకైశ్వర్యముతో నొప్పెను. దీనిని మూఁడువంశములవారు పరిపాలించిరి. హరిహరవంశము (క్రీ. శ. 1336-1487) (2) నరసింగవంశము (క్రీ. శ. 1487-1542) (3) అళియరామరాజవంశము (క్రీ. శ. 1542-1565) ఈసామ్రాజ్యము తల్లికోటయుద్ధము (1614) తోనడుగంటినది.

శ్రీకృష్ణరాయలు తాతయే సాళువ నరసింగవిభుని ముఖ్య సేనానాయకుఁడై యుండెను. ఈతనికీర్తి సర్వదిక్కుల బ్రకాశించెను. ఈతని పుత్రుఁడు నరసరాజు తండ్రికంటెఁ బరాక్రమవంతుఁడై, సాళువ నరసింగరాయని కుమారుఁడగు ఇమ్మడి నరసింహరాయలు బలహీనుఁడగుటఁ గాంచి, యాతని నామమాత్రావశిష్టునిఁజేసి రాజ్యమాక్రమించెను.

ఈనరసరాజే మనకృష్ణదేవరాయలవారికిఁ దండ్రి. నరస రాజునకుఁ దిప్పాంబ నాగాంబయను నిరువురు భార్యలు గలరు.

నాగాంబ భోగకాంతయని చెప్పుదురు. కాని యిందులకుఁ దగిన నిదర్శనములు లేవు. నాగాంబ విధిభార్యయనుటకే ప్రబల నిదర్శనములు గనిపించుచున్నవి. కృష్ణరాయలు నాగాంబకే జనించినాడు. నాగాంబ భోగకాంతయైయున్నను కృష్ణరాయల గౌరవమునకేమియు భంగములేదు. ఎవరికి జనించిననేమి! ధైర్యసాహసములు—గుణము—ప్రధానములు గదా! మగధ రాజ్య పీఠమధిష్ఠించిన చంద్రగుప్తుని విషయముగూడ ఇట్లే చెప్పఁబడియున్నది. ఇంతమాత్రమునఁ జంద్రగుప్తుని కీర్తి కావంతయుఁ గొఱంత సంభవింపలేదు.

శ్రీకృష్ణదేవరాయలు పట్టాభిషిక్తుఁడగువఱకును నాతని చరిత్రమంతగాఁ దెలియదు. ఇతఁడు క్రీ. శ. 1466 సంవత్సరమున జనించెనని కొందఱును, 1487 సంవత్సరమున జనించెనని కొందఱును చెప్పుదురు. కాని కొన్ని కారణములచే 1487 సంవత్సరముననే జన్మించెనని తలంచుటయే సమంజసముగ నున్నది.

రాయలు బాల్యదశంగూర్చి చెప్పుటకాధారమేమియు గనఁబడదు. అతఁడు బాల్యమాదిగఁ బరాక్రమవంతుఁడుగను, బుద్ధిశాలిగనుండెనని తెలియుచున్నది. నరసింగరాయల యనంతరమునఁ దిప్పాంబ పుత్రుఁడైన వీరనరసింహరాయలు రాజ్యాభిషిక్తుఁడయ్యెను. తిప్పాంబకు సవతిసుతుఁడగు కృష్ణ రాయలపైనున్న యీర్ష్యచేత, నాతనిని జంపుటకెన్నియో ప్రయత్నములు చేసెననియు, మంత్రిశేఖరుఁడగు తిమ్మరుసు కృష్ణరాయలను గాపాడెననియు, కొన్ని కథలవలనఁ దెలియు

చున్నది. ఇంకొక గాథకలదు. వీరనరసింహరాయలు మృతి
నొందునప్పుడు తిమ్మరుసును బిలచి, కృష్ణరాయల కన్నుల
నూడఁదీసి తెచ్చి చూపింపుమని చెప్పఁగా, దిమ్మరుసు మేక
కన్నులఁదెచ్చి చూపించెనట. ఈగాథ యెంతవఱకు సత్యమో
తెలియదు. కాని, తిమ్మరుసుమంత్రికిఁ గృష్ణరాయలయందు
మిగుల నభిమానము గలదు. తిమ్మరుసు మహామంత్రి సహా
యముచేతనే కృష్ణదేవరాయలు విజయనగరసామ్రాజ్య పీఠ
మధిష్ఠించెనని చెప్పవచ్చును. తిమ్మరుసునందుఁ గృష్ణరాయలు
పితృభక్తిఁ గలిగియుండి "అప్పాజీ" యని పిలచుచుండెడి
వాఁడు. ఈతఁడు క్రీ. శ. 1509 సంవత్సరములోఁ బట్టాభిషి
క్తుఁడై తిమ్మరుసుమంత్రిచే రాజ్యతంత్రమున శిక్షితుఁడ
య్యెను.

కృష్ణరాయలు రాజ్యాధీశుఁడైనవెంటనే పోర్చుగీసు
వారు కల్లికోటను బట్టుకొనుటకు సహాయమొనర్పవలసిన
దనియుఁ, దామాతనికి మహమ్మదీయులతోఁ బోరాటమునకు
దోడగుదుమనియు వార్తబంపిరి. దానికాతఁడు ప్రత్యుత్తర
మీయలేదు.

విజయనగర సామ్రాజ్యమునకు శత్రుపదమునందు
బహమనీ సుల్తానులును, వడ్డెరాజులు నుండిరి. అందు ముఖ్య
ముగ బీజాపూరు నవాబుతోడను, కటకేశ్వరుఁడగు ప్రతాప
రుద్రగజపతితోడను గలహము సంభవించెను. వీరలను దాఁకు
టకుఁ బూర్వమే కృష్ణరాయలు—ఉమ్మత్తూరు—శివసము
ద్రము—వశపఱచుకొన వలసిన వాఁడయ్యెను. అతఁడిక్కడ

ప్రభువులనెల్లర సామంతులుగఁ జేసికొని, దక్షిణదేశము
లోఁబఱచుకొని, యుదయగిరిని ముట్టడించెను. ఈముట్టడి 18
మాసములు జరిగినపిమ్మట, స్వాధీనపఱచుకొని విజయనగర
మునకు వచ్చెను.

కొండవీటి దుర్గమున గజపతి బలములను సిద్ధము జేసి
కొనుచున్నాడనివిని, కృష్ణరాయలు దానింబట్టుకొనుటకు మరల
బయలుదేఱి, మార్గమున నద్దంకి, వినుకొండ, బెల్లముకొండ,
నాగార్జునకొండ, తంగేడు, కేతవరము, మొదలగు వానిని
స్వాధీనపఱచుకొనెను. కొండవీడుదుర్గము లోఁబడినప్పుడు,
ప్రతాపరుద్రుని పుత్రుఁడును, బంధువుఁడునగు వీరభద్రరా
యఁడు మున్నగు రాజులును, మల్హూఖాన్, యుద్ధండఖాన్—
అను రాయనాఁడి మహమ్మదీయులును, బట్టుబడిరి. వీరభద్ర
రాయఁడు శ్రీకృష్ణరాయలకుఁ బందీయై మాలికి కెన్నాప
సీమలకుఁ బంపఁబడెను.

కొండవీటిని సాధించి, కృష్ణరాయలు, చిన్నాదేవి,
తిరుమలదేవులతో, బెజవాడ, శ్రీకాకుళము, ధరణికోట అమ
రావతి మున్నగు ప్రదేశములయందు దేవాలయముల దర్శించి
యనేక శాసనములు వేయించెను.

ఇంతలోపుగఁ బ్రతాపరుద్రగజపతి యూరకుండినవాఁడు
కాడు. కొండపల్లిదుర్గమున నిండుసేనలఁ జేర్చియుంచెను. ఈ
వార్తవిని కళింగముమీఁదకు బయలుదేఱి, కొండపల్లిని వశము
చేసికొనెను. ఆసమయమునఁ బ్రతాపరుద్రుని భార్యయుఁ,
బుత్రికయు, నేడుగురు సేనానాయకులును, బిజిలీఖాన్ అను

యవనముఖ్యులును, బట్టువడిరి. ప్రతాపరుద్రుడు మరల యవ
నుల ప్రేరేపణమునఁ దొందరపెట్టునేమోయని తలంచి,
రాయలు—అనంతగిరి—ఉండ్రగొండ, అరువపల్లి, కమ్మము
మెట్టు, జల్లిపల్లి, ఉర్లగొండ, కండికోఁడ మొదలగునవి
యాక్రమించుకొని, ప్రతాపరుద్రుని కటకము వఱకును దరిమి,
కటకపురిని ముట్టడించి, యాతనితో సంధిఁ జేసికొని, యాతని
పుత్రికను వివాహమాడి, కృష్ణకుత్తరభాగమునఁ దాను జయిం
చిన భాగమును నాప్రతాపరుద్రునకు మరలనిచ్చి, తిరిగి
వచ్చుచు పొట్నూరువద్ద జయస్తంభమునిలిపి, రాజమహేం
ద్రవర మార్గమున విజయనగరముఁ జేరెను.

తరువాత రాయలు మూడుసంవత్సరముల కాలము
శాంతముగఁ గడపి, చోళమండలమందుఁగల దేవాలయము
లకుఁ జెక్కు మాన్యములిచ్చి, జనుల యుపయోగార్థము చెఱు
వులు—కాలువలు త్రవ్వించి, దేశమునందంతట సరియైన
పాలకుల నియమించి, సైన్యముల నద్భుతముగాఁ జేర్చి యవ
నులపై దాడివెడల సిద్ధమగుచుండెను. చిరకాలమునుండియు,
మహమ్మదీయులకును, విజయనగరము వారికిని వివాదప్రదేశ
ములుగానుండిన రాయచూరు, ముద్గల్లు దుర్గములఁ గైకొనవల
యునని రాయల యుద్దేశమై యుండెను. అందుకొఱకాతఁడు
రాయచూరు దుర్గమును ముట్టడింప బయలుదేరెను. రాయ
చూరు ముట్టడికొఱకాతఁడొనర్చిన యుద్ధసన్నాహ మత్యద్భుత
మని ప్రత్యక్షముగాఁ జూచిన "న్యూనిజ" అను చరిత్రకా
రుఁడు వ్రాసియున్నాడు. 7 లక్షల మూఁడువేల కాల్బలము

లును, 32600 గుఱ్ఱములును, 551 గజములు నుండెనఁట. ఇట్టి మహాసైన్యముతో రాయలు రాయచూరు దుర్గమును ముట్టడించెను. ఈముట్టడి వార్తవిని అదిల్షా గొప్పసైన్యముతో వచ్చి రాయలునెదిరించెను. ఈ ఘోరయుద్ధమునఁ దురుష్కులు పరాజితులయిరి. కొలది దినములకే దుర్గము రాయలకు స్వాధీనమయ్యెను. ఓడిపోయిన అదిల్షా సంధికొఱకు రాయలుకడకు రాయబారమంపెను. కాని, రాయలు చెప్పిపంపిన నిబంధనలు అదిల్షాకు సమ్మతముగ లేవు. అందుచే రాయలు మఱల బీజాపూరుపైకి వెడలి, యానగరమును ధ్వంసము జేసి, దారిలో నున్న కల్బర్గాదుర్గమును ముట్టడించి, స్వాధీనము జేసికొనెను.

ఈ కృష్ణరాయలు—అంతకుమున్నెన్నో సంవత్సరముల క్రిందట నంతరించిన బహమనీరాజ్యము మరల స్థాపించి, యావంశజులలో నొకనిని కల్బర్గులో రాజ్యాభిషిక్తునిఁ జేసెను. ఆకారణముచేతనే రాయలు "యవనరాజ్య స్థాపనాచార్యుఁ డని పిలువఁబడెను.

రాయచూరు యుద్ధమైనపిమ్మట రాయలు తొమ్మిది సంవత్సరముల వఱకును—రామరాజ్యముగ నేలి 1530 సంవత్సరమునఁ గీర్తిశేషుఁడయ్యెను.

## రాజ్యము.

కృష్ణానదికి దక్షిణమునసున్న దేశమంతయుఁ గృష్ణరాయల యధీనమునసుండెను. ఉత్కళము నిరంకుశ ప్రభుత్వము. అనేకులితనికి సామంతరాజులై యుండిరి. కృష్ణరాయలు

సామంత సంస్థానములుగాక, మిగిలిన భాగములకుఁ బ్రతినిధు లనేర్పఱచెను. రాయలుచే నచ్చటచ్చట నుంచఁబడిన ప్రతినిధులకు నాయకులని పేరు. మొత్తముమీఁద నీతని రాష్ట్రమున శ్రీరంగపట్టణము—వేలూరు—తంజావూరు—మధుర జింజి—మొదలగు ప్రదేశములందు 25 నాయకులుండిరి.

రాష్ట్రాభివృద్ధికొఱకును, శత్రునిర్మూలనముకొఱకును రాయలయొద్ద 10 లక్షలకు మించిన సైన్యముండెను. ఇంతటి సైన్యమును భరించుటకీతఁడు చేసినయేర్పాటులు మిగుల చిత్రముగ నుండును. తన సామంతరాజులందఱును సమానము నందఱిప్రవీణతగలవారిగఁజేసి, వారివారి యాదాయమును బట్టి వారివద్ద కొంత కొంత సైన్యముంచెను. రాయలయాజ్ఞ యైనప్పుడు సామంతరాజులు వారియొద్దనున్న సైన్యములకు వారే యధిపతులై యుద్ధమునకు రావలెను.

వ్యాపారము.

కృష్ణరాయలు తన పరిపాలనమునఁ బ్రతివ్యాపారమును వృద్ధిఁజేసెను. యుద్ధము జరుగుచుండెడి రోజులలోఁ గూడ వ్యాపారమున కేమాత్రము భంగము లేకయుండెను. విదేశములతోఁగూడ సముద్రముద్వారా వ్యాపారము జరుగుచుండెను. అనేకవిధములగు వస్తువులీదేశమునుండి యితర దేశములకు నెగుమతి చేయఁబడుచుండెను. రాయలు పోర్చుగీసు వారితో మైత్రిజేసికొని వారిచే ననేకవిధములగు యుద్ధోపకరణములఁ జేయించెను. ఇదియుంగాక యీతని రాష్ట్రమం దచ్చటచ్చట బంగారముత్పన్నమగు స్థలములను, వజ్రపు

గనులు తుండెడివి. వానిని దీయించి తనకుఁగావలసినవి యుంచు
కొని, తక్కినవి విక్రయమునకుఁ బంపుచుండెడివాఁడఁట.

వేయేల! రాయలుకాలమున లక్ష్మి — విజయనగర
రాజ్యమున సువర్ణశృంఖలములచేఁ గట్టివేయఁబడినదని చెప్ప
వచ్చును.

## శిల్పకళ.

రాయలునకు శిల్పకళయందభిరుచియుండెను. ఈతఁడు
పట్టభద్రుఁడైన వెంటనే చిత్రమైన నగిషీపనులతో నెంతయో
ధనము వెచ్చించి సభామండపమొకటి కట్టించెను. విఠ్ఠదేవా
లయమున కొకగోపురమును, కృష్ణాలయమును, హజారరామ
స్వామి యాలయమును గట్టించెను. ఉగ్రనరసింహ విగ్రహ
మొక్కటి చెక్కించెను. మహమ్మదీయులు విజయనగరము
కొల్లగొట్టినప్పుడీవిగ్రహము ననేకచోట్ల నగులఁగొట్టిరి. కాని,
అది యిప్పటికిని దర్శనీయమై చూపరులకు భయము గొలుపు
చుండును. ఈతఁడు కట్టించిన దేవాలయముల యందును,
చెక్కించిన విగ్రహములయందును, నున్న చెక్కడపుఁబని
వర్ణింపఁ దరముకాదు. ఈతఁడు సస్యసమృద్ధికై కొరగల్లువద్ద
నొక గొప్పయానకట్టఁ గట్టించెను. తల్లియందున్న భక్తిఁజూపు
టకు నాగలాపురమను నొకపురమును గట్టించెను. ఇదియే
యిప్పుడు "హాస్పేట" యను పేరనొప్పుచున్నది.

## గుణము.

రాయలు మిగుల దయాస్వభావము గలవాఁడు. కాని
శత్రువులపట్ల మాత్రమిట్లుండఁడు. ఇతని పిరతుత్రిమోదిగ

గుణమే. అతఁడు మహాధైర్యశాలియనియు, పరాక్రమవంతుఁ
డనియుఁ జెప్పుట కతఁడు పట్టుదలతోఁ జేసిన రాయచూరు
యుద్ధమే సాక్షి. అతని రాజనీతికౌశలమునకుఁ బోర్చుగీసువారి
సహాయము నొందఁ గోరుచుండుటయు, మహమ్మదీయులలో
నంతఃకలహములు గలిగించుటయు, బోర్చుగీసువారితో మెలకు
వతో వ్యాపారము పెంచి వారిని వశపఱచుకొనుటయే తార్కా
ణము. అతని నిష్కళంక గుణమునకుఁ బ్రతాపరుద్రుని
భార్యయే సౌభాగ్యతాపత్రము. సర్వమతములను సమభావ
ముతోఁ జూచెననుటకు చోళమండలమందున్న వైష్ణవ,
శైవ—జైన, బుద్ధదేవాలయములకు దానముగ మాన్యము
లిచ్చుటయే సాక్షి.

## భాషాభివృద్ధి.

ఇతఁడాంధ్ర భాషాపోషకుఁడై యొప్పుటయేగాక
కవియై ఆముక్తమాల్యద యను గ్రంథమును రచించెను.
ఇతని యాస్థానమున 1 అల్లసానిపెద్దన 2 ధూర్జటి 3 ముక్కు
తిమ్మన 4 అయ్యలరాజు రామభద్రుఁడు 5 మాదయగారి
మల్లన 6 రామరాజభూషణుఁడు 7 పింగళి సూరన 8 రామ
కృష్ణుఁడు—అను కవులుండిరి. వీరినే యష్టదిగ్గజములందురు.
ఇందు అల్లసానిపెద్దన విరచితమగు మనుచరిత్రమునకును—
ముక్కుతిమ్మన కృతమగు పారిజాతాపహరణమునకును
రాయలు కృతికర్తయై యశమందినాఁడు. రాయలు కాలమున
ఆంధ్రభాషావధూటి సర్వాలంకారశోభితయై విలసిల్లెను.



# ౬. ప్రతాపరుద్రుఁడు.

పౌరాణికయుగమునుండి, నేటివఱకును బ్రఖ్యాతమైన భరతఖండమును బాలించిన మహారాజులెందఱో కలరు. కాని, రాష్ట్రాధిపతులై విలసిల్లినవారందఱును మహాత్ములు గారు. మృతులైనను కీర్తిశరీరముతో నిత్యులై ప్రకాశించు మహాపురుషులే మనకాదర్శప్రాయులు. అందుచేతనే శ్రీరామ నల హరిశ్చంద్రాది మహానుభావులయొక్క పవిత్రచరిత్రములు కవులచే నిరంతరము మధురముగ వర్ణింపఁబడుచుండును. పౌరాణికయుగమునఁ గాక చరిత్రయుగమునఁ గూడ నట్టివారు జన్మించి, తమ యసమాన పరాక్రమముచే, సద్విద్యావిజ్ఞాన సంపదచే, నసాధారణవితరణాది గుణములచే మాతృదేశమును వెలుఁగించిరి. ఆంధ్రదేశమునఁ గూడ నట్టి మహనీయులుద్భవించి, యాంధ్రుల ప్రాచీనవైభవము, ఆంధ్రుల ప్రాచీన ప్రసిద్ధి, ఆంధ్రుల ప్రాచీన దివ్యచారిత్రము, ఆంధ్రసామ్రాజ్య మహావైభవము నెట్టిదని సాక్ష్యమిచ్చుటకు శాసనములు నిలిపి నేటికిని కీర్తికాయమున జీవించియున్నారు. అట్టివారిలో ప్రతాపరుద్రచక్రవర్తి యొకఁడై యున్నాఁడు. ఇతఁడోరుగల్లు రాజధానిగఁ జేసికొని, యాంధ్రసామ్రాజ్యము నిరంకుశముగఁ బరిపాలించి, తననామ మాంధ్రలోకము మఱవకుండఁ జేసెను.

కాకతీయాంధ్రచక్రవర్తియగు గణపతిదేవుఁడు కీర్తిశేషుఁడైన పిదప, నతనికిఁ బుత్రసంతానము లేకపోవుటచేఁ

పుత్రికయైన రుద్రమదేవియే రాజ్యభారము వహించెను. ఈమె యాంధ్రరాష్ట్రపరిపాలనము వేనోళ్ల శ్లాఘింపఁబడెను. ఈమెకును పుత్రసంతానము లేదు. ముమ్మడమ్మ—రుయ్యమ్మలను నిరువురు పుత్రికలు మాత్రము గలరు. ఇందు ముమ్మడమ్మ చాళుక్యవంశోద్భవుఁడైన వీరభద్రరాజునకిచ్చి వివాహము సేయఁబడెను. ద్వితీయపుత్రికయగు రుయ్యమ్మను ఇందులూరి అన్నదేవ భూపాలునకిచ్చి పెండ్లిఁజేసెను. ముమ్మడమ్మకుఁ బ్రతాపరుద్రుఁడు, అన్నమదేవుఁడు నను నిరువురు పుత్రులుదయించిరి. రుయ్యమ్మకు సంతతిలేదు. ప్రతాపరుద్రుని జననకాలమెప్పుడో నిశ్చయముగాఁ దెలియదుగాని క్రీ. శ. 1240 సంవత్సరమని యూహింపఁబడినది. రుద్రమదేవికిఁ పుత్రసంతానము లేకపోవుటచేత, దౌహిత్రుఁడైన ప్రతాపరుద్రుని దత్తతఁజేసికొని, యాతనికి యుక్తవయస్సువచ్చిన పిదపఁ ద్రిలింగరాజ్యసింహాసనము నధిష్ఠింపజేసెను.

ఈప్రతాపరుద్రుఁడు రాజ్యభారము వహించి మిగుల పరాక్రమవంతుఁడై, రుద్రమదేవి పరిపాలనము సేయుసమయమునఁ దిరుగుబాటొనర్చి రాజ్యమున బాధలు గలిగించిన సామంతనృపాలుర గర్వమడంచి, యాంధ్రసామ్రాజ్యమును దినాభివృద్ధినందునట్లు తన యావచ్ఛక్తిని వినియోగపఱచి, సంపూర్ణ సఫలీకృత మనోరథుఁడయ్యెను. ఏకశిలానగరమాంధ్ర సామ్రాజ్యమునకు రాజధానినగరమై విలసిల్లెను. ఐశ్వర్యమునందుఁగాని, కట్టడములయొక్క సౌందర్యమునందు

గాని రాజభవనములయొక్క రమణీయతయందుఁ గాని, తురుష్కసామ్రాజ్యమునకు రాజధానియగు ఢిల్లీనగరము కంటె మిన్నయై యొప్పుచుండెను.

ప్రతాపరుద్రుని సేనానులలో ముఖ్యుఁడు నాగయగన్న సేనాని. ఇతని సోదరులలో నెల్లయనాయకుఁడు, మేచయ నాయకుఁడుగూడ సేనానులుగనుండిరి. ప్రతాపరుద్రుని పిన తల్లియగు మయ్యమ్మకు భర్తయైన యన్నమదేవునకు సోదరుఁడైన యిందులూరి రుద్రమరాజు ప్రతాపరుద్రుని సైన్యాధ్యక్షులలో నొకఁడుగానుండి, కొంత భూభాగమునకు రాజప్రతినిధియై యుండెను. బెండపూడి అన్నామాత్యుఁడు గజ ఘటసేనల కధ్యక్షుఁడై యుండెను. సాహిణిమారుఁడను నతఁడు సైన్యాధీశ్వరులలో నొక్కఁడుగానుండి పల్లాటిసీమకుఁ బ్రతినిధియై యుండెను. ప్రతాపరుద్రుని మంత్రులును సేనాధీశ్వరులును, రాజప్రతినిధులును, స్వామికార్య నిర్వాహకులై — మహాచక్రవర్తి కాంధ్రసామ్రాజ్యాభివృద్ధికిఁ దోడ్పడిరి. ప్రతాపరుద్రుని కాలమున నాంధ్రసామ్రాజ్యము నవయౌవనస్థితిలో నొప్పుచుండెను.

## శైవమతము.

ప్రతాపరుద్రుఁడు శైవమతాభిమానియగుటచే నాతని రాష్ట్రమునకుఁ బెక్కండ్రు శైవమతగురువులు వచ్చుచుఁబోవుచుండిరి. చక్రవర్తియొక్క యనుచరులును, సేనాధీశ్వరులును, సామంతరాజులును శైవమతావలంబకులై యుండిరి. అంతకుమున్న రాష్ట్రమున జైనమతము ప్రాబల్యముగనుండెను

జైన మతావలంబకులకును, స్మార్త మతావలంబకులయిన బ్రాహ్మణులకును దఱుచు వివాదములు జరుగుచువచ్చెను. కాని, జైనులెక్కువగనుండుటచే బ్రాహ్మణులేమియుఁ జేయఁ జాలకైరి. ప్రతాపరుద్రుని కాలమున—నధికారముగలిగిన వారెల్లరును శైవులయియుండుటచే, నాబ్రాహ్మణులు నెమ్మదిగాఁ బ్రతాపరుద్రుని జైనమతనాశనమునకై పురికొల్పిరి. ఏదియెట్లయినను శైవమతము ప్రబలుచుండుటచేత రాజునకు జైనమతమునందసూయ కలిగెను. జైనులమాన్యములు గైకొనఁబడుటచే వారు త్రిలింగరాజ్యమున నుండుటకు వీలులేక యిటునిటుపోయిరి. బ్రాహ్మణులమాటలు విని ప్రతాపరుద్రుఁడు జైనులను తన రాజ్యమునుండి వెడలనడిపిన కారణమున వారు ఉత్కలరాజుతోఁ గుట్రలుగావించి, ఢిల్లీచక్రవర్తులగు మహమ్మదీయులు దాడి వెడలివచ్చునట్లు గావించి, కాకతీయాంధ్రసామ్రాజ్యలక్ష్మి యస్తమింపఁజేసిరని చెప్పుదురు. ఇది యెంతవఱకు సత్యమో చెప్పఁజాలము.

## దే వా ల య ము లు.

ఏకశిలానగరమాలయములకుఁ గడుఁబ్రసిద్ధికెక్కియున్నది. అనేక దేవతామహోత్సవములు నిరంతరము జరుగుచుండును. మఱియొక విశేషముగలదు. రణరంగమునఁ బరాక్రమమున విజృంభించి పోరాడి వీరస్వర్గమలంకరించిన మహావీరుల పరాక్రమము ప్రకటించుటకు వారి విగ్రహములు చెక్కించి, వారిపేరున నాలయములు గట్టించి పూజించునాచారము కలదు.

## మహమ్మదీయుల దండయాత్ర.

ప్రతాపరుద్రమహీపతి యాంధ్రసామ్రాజ్యాభివృద్ధికిఁ జేయవలసిన పనులన్నియుఁ జేయుచుండెను. సామ్రాజ్యము దినదినాభివృద్ధినందుచుండెను. సామంతరాజులందఱును నాచక్రవర్తి ప్రతాపమునకు భీతిల్లి సేవించుచుండిరి. ఆతనికీర్తి ప్రతాపడిండిమము దేశమంతటను మ్రోగుచుండెను.

ప్రతాపరుద్రునితో సమకాలికుఁడగు దేవగిరిరాజగు రామదేవుఁడును, ప్రతాపరుద్రుఁడును సమమైన పరాక్రమవంతులు. కాని, యిరువురును నొకరి నొకరు జయించు ప్రయత్నము నెప్పుడును జేయకుండిరి.

ఈకాలమున ఢిల్లీసామ్రాజ్యము మహమ్మదీయులచేఁ బాలింపఁబడుచుండెను. ఇంతకుమున్న నూరుసంవత్సరముల క్రిందటనే మహమ్మదీయులు రాజ్యస్థాపనఁ జేసికొని హిందూమతద్వేషులై యుండిరి. మహమ్మదీయులవలనఁ దన రాజ్యమున కపాయము గలుగునని యూహింపక, చుట్టుప్రక్కలనున్న దుర్గముల విషయమై తగిన జాగ్రత్తఁ దీసికొనక, రాజధాని దుర్గము మాత్రము బలపఱచుకొని ప్రతాపరుద్రుఁడుండెను.

ఢిల్లీనగరమును ఖిల్జీవంశస్థుఁడగు జలాలుద్దీను సుల్తాను పరిపాలించుచుండెను. ఈతఁడు వృద్ధుఁడగుటచే నకారణముగ నొకరితోఁ బోరాడవలయునని తలంపులేనివాఁడై యుండెను. కాని యీతని సైన్యముల కధిపతియైయుండిన యీతనియన్న కుమారుఁడయిన యల్లాయుద్దీను బహుసాహసుఁడై యుండెను. ఈతనికిఁ బరదేశముల నాక్రమించుట యందభిలాష గలిగి,

గొప్పసైన్యముతో వెడలి మాళవదేశమును జయించి యాక స్మికముగ దేవగిరిపైకివచ్చెను. రామదేవుని సైన్యమానమయమున స్వల్పసంఖ్యగనుండెనను, నున్నదానితోడనే యాతఁడా మహమ్మదీయు నెదిరించెనుగాని తుదకు సంధిఁజేసికొనెను.

రామదేవునితో సంధిఁజేసికొన్న అల్లాయుద్దీను ఢిల్లీ కరిగి వృద్ధుఁడైన జలాలుద్దీనును జంపించి, తాను ఢిల్లీ చక్రవర్తియయ్యెను. ఇతనికి భరతఖండము నేకసామ్రాజ్యము నిలుపవలయునని యూహపొడమెను. ఇతఁడు క్రూరుఁడును, నిరక్షరకుక్షియునైనను రాజ్యతంత్రమునందుఁ గడుసమర్థుఁడు. ఇతఁడు ప్రతాపరుద్రుని రాజ్యమునుగూర్చియుఁ, బరాక్రమమును గూర్చియు విని, త్రిలింగసామ్రాజ్యమును ఢిల్లీసామ్రాజ్యములోఁ గలుపుకొనవలయునని యూహించి, గూఢచారులను బంపి, ప్రతాపరుద్రుని బలముల తెఱంగును, దుర్గముల స్థానములను గనుఁగొని తన యొద్దనున్న మల్లికాఫర్ అనువానిని సేనాధీశ్వరునిఁగాఁ జేసి త్రిలింగరాజ్యమును జయించుటకుఁబంపెను. మల్లికాఫర్ తన సైన్యముతో దేవగిరిమీఁదగ వచ్చెను. రామదేవుఁడంతకుమున్నే తురుష్కులతో సంధిఁ జేసికొని యుండుటచేత మల్లికాఫర్ వారి రాజ్యమునకేహానియుఁ గూర్పలేదు. అదియుంగాక రామదేవుఁడు మాతృదేశాభిమానమువిడిచి, మల్లికాఫరునకు సహాయముగూడఁ జేసెను.

మహమ్మదీయులు తన రాజ్యముపైకి దండెత్తి వచ్చుచున్నారనువార్తఁ బ్రతాపరుద్రుఁడు విని మంత్రిసామంత

వర్గమును, సేనాపతులను బిలిచి యిట్లు పలికెను. "వీరులారా!
తలవనితలంపుగా మనపై శత్రువులు తురుష్కులెత్తివచ్చుచు
న్నారు. ఇప్పట్టున మనము వెనుదీయరాదు. సమస్తమును
మీకుఁ దెలిసియేయున్నది. నేను మీకుపదేశము చేయఁదగి
నంత సమర్థుఁడఁగాను. మున్ను ధర్మరాజాదులచేఁ బాలింపఁ
బడిన ఢిల్లీసామ్రాజ్యలక్ష్మి నాక్రమించుకొని, నేడు మన
కాకతీయాంధ్రసామ్రాజ్యలక్ష్మిని గూడ వశపఱచుకొనఁ
దలఁచి వచ్చుచున్నారు. వీరరసపూరితమగు నార్యరక్తము
మన బాహునాళములయందుఁ బ్రవహించుచున్నది. వైరులను
దండించి యాంధ్రులు నిక్కమైన శూరులనిపించుకొనుటకుఁ
దగిన సమయము వచ్చినది. సంగ్రామమే సకల సౌఖ్యముల
కును బట్టుగొమ్మ. అదియే శూరులకుఁ గీర్తిప్రదేశము.
అదియే అగర్వశూరులు ధర్మసంరక్షణార్థమై రక్తముగార్చెడి
చోటు. వేయేటికి! మన యాంధ్రమాతను వీరమాతఁగఁ జే
యుఁడు. సంగరమున నద్వితీయపరాక్రమముతో మెలంగుఁడు.
ఒరనుండి దూసిన విచ్చుకత్తులను రిపుసంహారమగువఱకును
మరల నొరలోఁ జేర్పకుఁడు. ప్రాణావసానకాలమందైనను పగ
ఱకు వెన్నియకుఁడు. త్రిలింగసామ్రాజ్యలక్ష్మి చలింపకుండఁ
జేసి మీబలపరాక్రమ శౌర్యములు వీరుల కాదర్శకములు
గాఁ జేసి సకల దిక్కులను యశోవల్లికలఁ బ్రాకింపుఁడు.

ప్రతాపరుద్రుని నోటినుండి యీ నుడులు వెలువడగనే
యా యోధుల శరీరములఁ బులకలు పొడమెను. వారి హృద
యములు సంగరోత్సాహముచేఁ బూరింపఁబడెను. సంగరము

నకు "నేను ముందరుగుదు. నేను ముందరుగుదు"నని ప్రతి వీరుఁడును బలుకుచుఁ దన ప్రభుభక్తిని జూపించెను. అంతటఁ బ్రతాపరుద్రుఁడు మహమ్మదీయసైన్యము నెదుర్కొన లక్ష సైన్యమును బంపెను. ఈసైన్యమున కాతని సోదరుఁడగు నన్నమదేవుఁడధికారిగ నుండెను. మారయసాహిణియు, మఱికొందఱు నీతనికి దోడ్పడియుండిరి. ఇంతియేగాక యాసైన్యమునందుఁ బ్రాణములకయినను నాసపడక పోరాడు కమ్మవీరులును, వెలమవారును ననేకులు గలరు. అన్నమదేవుఁడీసైన్యముతో బయలుదేరి గోదావరీతీరముఁ జేరి, మల్లికాఫరు నెదుర్కొనుటకు రేవులనన్నిఁటిని గాచియుండెను. మల్లికాఫరు ఆంధ్రదేశమునఁ బ్రవేశించి యాయాపట్టణములయందున్న దేవాలయములఁ బాడుసేయుచుఁ బ్రజలహింసించుచు, గోదావరీతీరమునకు వచ్చెను. అతఁడు గోదావరిందాటుటకెంతయో ప్రయత్నము జేసెను. ఆంధ్రవీరులసాధారణపరాక్రమమున విజృంభించి గోదావరిందాటి మహమ్మదీయసైన్యము నెదిర్చిరి. పెక్కండ్రు మహమ్మదీయులు మడిసిరి. మల్లికాఫరు పరాజయమునంది ఢిల్లీకిఁ బాఱిపోయెను. ఇది క్రీ. శ. 1808 సంవత్సరాంతమున జరిగెను.

మల్లికాఫరు ఢిల్లీకిఁ జేరెనను మాటయేగాని త్రిలింగసామ్రాజ్యమునుగూర్చిన పట్టుదల నాతఁడువిడువలేదు. ఆంధ్రులను సాధించితీరవలయునని యల్లాయుద్దీనాతనిని మరల నధికసైన్యముతోఁ ద్రిలింగముపైకి క్రీ. శ. 1807 సంవత్సరము మార్చి నెలలోఁ బంపెను. ఈరెండవ దండయాత్రయందుఁగూడ మల్లి

కాఫరు ఆంధ్రులచే నోడింపఁబడి పలాయితుఁడయ్యెను. మూఁడవ సారి యాతఁడు మరల దండెత్తివచ్చి, సైన్యములతో నోరుగంటికోటచుట్టును విడిసియుండెను. ఇంతకుమున్న తురుష్కులతో రెండుసారులుపోరి యలసియున్నను నాంధ్రవీరులు తమ ప్రాణముల కాసింపక శత్రువులతోఁ దీవ్రముగఁ బోరొనర్చిరి. కాని యాంధ్రసేనాపతులు సైన్యసమేతముగాఁ జిక్కుంద్రుమడసిరి. విజయలక్ష్మి తురుష్కులనే వరించుచుండుటచేత, ప్రతాపరుద్రుఁడాలోచించి మల్లికాఫరుతో సంధిఁ జేసికొనెను. ప్రతాపరుద్రుఁడు సంధిఁ జేసికొన్నదే చాలునని మల్లికాఫర్ ఢిల్లీకి మరలిపోయెను.

ప్రతాపరుద్రుఁడు ఢిల్లీచక్రవర్తితో సంధిఁ జేసికొనెనని కొందఱు సామంతరాజులు తిరుగుబాటొనర్చి స్వతంత్రతఁ బ్రకటించిరి. అంతటఁ బ్రతాపరుద్రుఁడు బయలుదేరి తిరుగుబాటొనర్చిన రాజులనణఁచి, మరలఁ దనకువిధేయులుగాఁ జేసికొని, మహమ్మదీయ దండయాత్రలవలన నష్టమైన సైన్యమును మరలఁ జేర్చుకొనియుండెను.

దేవగిరియందు రామదేవుఁడును నతని పుత్రుఁడును మరణించిరి. రామదేవుని యల్లుఁడగు హరిపాలదేవుఁడు మహారాష్ట్రమునుండి తురుష్కులను బాఱఁద్రోలెను. ఈసమయమున మల్లికాఫరు అల్లాయుద్దీనునకు విషప్రయోగము చేయించి చంపెను. అల్లాయుద్దీను మరణింపఁగా నాతని జ్యేష్ఠసుతుని కన్నుల నూడఁబెఱికించి, యాతని తమ్ముని నైదేండ్లవానిని రాజ్యమునందు నిలిపి, మల్లికాఫరు ప్రభుత్వము సేయుచునారం

భించెను. మల్లికాఫరు పాలనమెల్లను వారిసేవకులే వానిన తె
మొందించిరి. అల్లాయుద్దీను నాలగవకుమారుఁడగు ముబారక్
అనువాఁడు కఠినచిత్తుఁడై సోదరులఁజంపి పట్టాభిషిక్తుఁడయ్యెను.
ఖుస్రూయను సేనాపతి ముబారకునిఁజంపి, తాను రాజ్యారూ
ఢుఁడయ్యెను. ఈఖుస్రూ ప్రచ్ఛన్నవేషముతోనున్న హిందువు
ఢిల్లీసామ్రాజ్య మీస్థితిలోనుండఁగా, పంజాబులో సుబేదారుగ
నున్న యొకఁడువచ్చి ఖుస్రూనిజంపి, ఢిల్లీకి పట్టాభిషిక్తుఁడై
గ్యాసుద్దీన్ అను పేరుతో రాజ్యపరిపాలన మారంభించెను.

## ఆంధ్రభాష.

ప్రతాపరుద్రునకు బాల్యమునుండియు నాంధ్రగీర్వాణ
భాషలయందు మిగుల నభిలాషగలదు. అతని యాస్థానమునఁ
బెక్కండ్రు కవులుండిరి. అందు గీర్వాణభాషాకోవిదుఁడగు
విద్యానాథుఁడు ముఖ్యుఁడు. ఈతఁడు సంస్కృతమునఁ బ్రతా
పరుద్రయశోభూషణమను గ్రంథమును వ్రాసి, ప్రతాపరుద్రున
కంకితమిచ్చెను. త్రిపురాంతకకవి—మారనకవి—భాస్కర
కవి—మంచనకవియు నీతని రాష్ట్రమునందే యుండిరి. ఈ
చక్రవర్తి పరిపాలనమున నుభయభాషలును జక్కఁగ నాద
రింపఁబడినవని చెప్పవచ్చును.

## పరిపాలనము.

ఈతని పరిపాలనాకాలమున నాంధ్రసామ్రాజ్యము
అనేకభాగములుగ భాగింపఁబడి, యొక్కొక్కభాగమున కొ
క్కొక్కయధికారి యేర్పఱుపఁబడెను. రాజ్యపరిపాలన మీతఁ
డతిసమర్థతతో నెరవేర్చెను. రాజప్రతినిధులు, సేనాపతులు—

మొదలగు నానాద్వీపదేశములనుండి ఆయాద్వీపదేశములకు మార్చఁబడుచుండెను. వాణిజ్యము విదేశములతోఁ గూడ నభివృద్ధిఁ బొందెను. ఈతని పరిపాలనము శ్లాఘింపనివారెవ్వరును లేరు.

## తురుష్కదండయాత్ర—సామ్రాజ్యపతనము.

గ్యాసుద్దీన్ తుగ్లక్—తన కుమారుఁడగు నలూఘ్ ఖానుని మహాసైన్యసమేతముగాఁ బ్రతాపరుద్రునిపైకిఁ బంపెను. ప్రతాపరుద్రుఁడిదివఱకెన్నియో యుద్ధములు చేసియున్నను జలింపక పేరుగాంచిన ఏనుఁగులను నియమించి మహమ్మదీయుల నెదుర్కొనెను. ఆంధ్రులు తమ ప్రాణములు దాఁచుకొనక పోరాడిరి. మహమ్మదీయులిదివఱకెన్నఁడును బొందని పరాభవము బొందిరి. అలూఘ్ ఖానుఁడు ఢిల్లీకి మరలిపోయెను. ఇది క్రీ. శ. 1827 సంవత్సరమున జరిగెను.

అలూఘ్ ఖానుఁ డాంధ్రులచేనందిన పరాభవము సామాన్యమైనది కాదు. అతఁ డేకశిలానగరమునుండి ఢిల్లీఁ జేరునప్పటికి మూఁడువేల గుఱ్ఱపుదళము మాత్రమే మిగిలియుండెను. అతని కాంధ్రులచే జరిగిన పరాభవము హృదయమున నగ్నివలెఁ బ్రజ్వరిల్లుచుండెను. చక్రవర్తియగు తుగ్లక్ కూడ తన విచారమును క్రోధముగా మార్చుకొని, యాంధ్ర సామ్రాజ్యభాగమును కబళింప నిశ్చయించుకొని, గొప్పసైన్యమును సమకూర్చి మరల నలూఘ్ ఖానునే యాంధ్రదేశము మీఁదికిఁ బంపెను. అంతకు మున్నాంధ్రులచేఁ బరాభవింపఁ బడియున్నవాఁడగుటచే నలూఘ్ ఖానుఁ డత్యుత్సాహముతో

నాపఁగఁ దీక్షఁ గొనఁదలఁచి బయలుదేరెను. మహాసైన్యముతో
[illegible]లుదేరిన యలూఫ్‌ఖానుఁడు మొదట నాంధ్రరాజ్యము
లోనున్న "బీదరు" దుర్గమును వశముచేసికొనెను.

మహమ్మదీయులు బీదరు దుర్గమునకు వచ్చువఱకు
వారి రాకంగూర్చి ప్రతాపరుద్రునకుఁ దెలియలేదు. అది
యుంగాక తురుష్కులంత త్వరలో మరల వత్తురని యాతఁడు
తలంచలేదు. ఇంతకుముందు జరిగిన యుద్ధములలోఁ బెక్కం
డ్రు సైనికులు మడసిరి. యుద్ధమునకుఁ దగిన సైన్యము సిద్ధ
ముగ లేదు. ఇది యట్లుండఁ బద్మనాయక వెలమలకును,
రెడ్లకును, క్షత్రియులకును, గమ్మవారికిని నంతఃకలహములు
వృద్ధియగుచుండెను. కాని, యీకలహములు త్రిలింగరాజ్య
మునకు ముప్పుదెచ్చునవి కావు. వారు తమలోఁ దాము పోరా
డుచుండినను రాజభక్తిని మాత్రము విడువలేదు. ప్రతాపరు
ద్రుని యాజ్ఞ యెట్టిదైనను వారు శిరమునఁ దాల్చుచునేయుండిరి.
ఈసారి తురుష్కుల రాకకుఁ బ్రతాపరుద్రుఁ డించుక విచా
రించెను. కాని యధైర్యమందలేదు. అతఁడు సేనాధీశ్వరులను
రావించి యిట్లు పలికెను. "వీరాగ్రేసరులారా! ఇంతకుమున్ను
మనచే నోడింపఁబడినవాఁడయ్యును, నలూఫ్‌ఖానుఁడు మరల
మనపై దండెత్తివచ్చుచున్నాఁడు. ఈతురుష్కులు పట్టిన
పట్టు విడువకయున్నారు. ఇంతకు మున్నితఁడు వచ్చి రెండు
మాసములయినను కాలేదు. ప్రస్తుతము సైన్యబలము మనకు
తక్కువగ నుండెను. ఏమిచేయుటకును దోచకున్నది. వీరెల్ల
రును మహాసంగ్రామములుచేసి యలసియున్నారు. త్రిలింగ

సామ్రాజ్యము నేవిధముగ నయినఁ దమ వశము చేసికొనవల యునని వారు దీక్ష వహించియున్నారు. ఈనాఁటి యుద్ధముతో నాంధ్రరాజ్యలక్ష్మి యస్తమించుటో, లేక స్థిరముగ నిలిచి యుండుటో జరిగితీరునని తోఁచుచున్నది. ఘడియఘడియకు నిల్లెత్తినచ్చుచున్న యీమహమ్మదీయులతో నెంతవఱకుఁ బోరాడుదుము. ఏమైనఁ గంఠమునఁ బ్రాణములుండఁగాఁ దురుష్కులకు లొంగుట కలలోని మాట. మీయట్టి వీరులు నాకుఁ గుడి యెడమభుజములై యుండఁగాఁ ద్రిలింగరాజ్యేందిర పరహస్తంగత కాదని నా నమ్మకము."

ప్రతాపరుద్రునిమాటలువిని దండనాయకులు "మహా రాజా! మహమ్మదీయులు వచ్చుచున్నారని నీవావంతయు సందియమందవలదు. ఈ యున్న బలముతోడ నే వారి నెదిరించి, మాకంఠనాళములలో నూపిరి యున్నంతవఱకు వారి నేకశిలా నగరిదుర్గమున నడుగు బెట్టనీయము. స్వాభిమానమును నిలుపు కొందుము. మాతృదేశము నుద్ధరింతుము. రాజభక్తిఁ బ్రకటింతు" మని పలికిరి. అంతఃకలహములతో నావరింపఁబడిన వారైనను నా సమయమున సమస్తమును మఱచి, దండనాయకులట్లు పలికినందులకుఁ బ్రతాపరుద్రుఁడు మిగుల సంతసించి, యున్నంతవఱకెట్టి లోపము లేకుండ యుద్ధప్రయత్నము చేసి తురుష్కుల రాకకెదురు చూచుచుండెను.

కొలది కాలములోనే మహమ్మదీయ సైన్యము వచ్చి యేకశిలానగర దుర్గమును ముట్టడించెను. మహంకాళిదొరయు, గొలిపాక సిద్ధయయు, శ్రీరంగమదేవుఁడు, అన్నమదేవభూపా

లుఁడు మొదలగు వారు తమ తమ బలములతోఁ గోట నలు
పక్కలనిలిచి రుద్రునికైనఁ బ్రవేశింపనలవిగాకుండఁ గాచు
చుండిరి. తురుష్కులు కోటలోఁ బ్రవేశించుటకుఁ దెరువుగానక
యాంధ్రసైన్యముపై లెక్కలేని ఫిరంగులను గాల్పనారంభిం
చిరి. ఆంధ్రులు పంచలను గాసెకు బిగించికట్టి యస్త్రశస్త్రాది
దివ్యాయుధహస్తులై త్రిలింగసామ్రాజ్య సంరక్షణార్థము ప్రాణ
ముల నాసింపక పోరుచుండిరి. రేచర్ల సింగమనాయుడు తన
కెదురైన తురుష్కుల శిరంబులను దన కరవాలమున నరి
యిచ్చుచుండెను. కొందఱాంధ్రవీరులు కోటయొక్క యగ్ర
భాగమున నిల్చి శత్రువులను లోపలఁ బ్రవేశింపనీయక పోరు
చుండిరి. ఆంధ్రులెంత శౌర్యముతోఁ బోరుచుండినను మహ
మ్మదీయులు వెనుకంజవేయక, దీక్షతో యుద్ధము సేయుచు
ముందునకుఁ ద్రోసుకొనిపోవుచుండిరి. కోటగోడలు బ్రద్దలగుట
కనేక శతఘ్నులు ప్రయోగింపఁబడుచుండెను. ఆంధ్రవీరులు
పెక్కండ్రు హతులగుచుండిరి. కోటగోడలు సమ్మదిగాఁ గూలఁ
దొడఁగెను. ఆంధ్రుల ధైర్యము సడలిపోవుచుండెను. త్రిలింగ
సామ్రాజ్యలక్ష్మి యికనాంధ్రులఁ బాసిపోవునని వారికధైర్య
ముతోఁచెను. వారెంత ఘోరముగఁ బోరాడినను లాభము లేక
పోయెను. ప్రతాపరుద్రుఁడు గూడ నట్టిసమయమున రణరంగ
మున నవతరించి సైనికులను రణంబునకుఁ బురికొల్పుచుం
డెను. తురుష్క సేనాధీశ్వరులు ప్రతాపరుద్రునిఁ బట్టుకొనుట
కనేకప్రయత్నములు చేయుచుండిరి. ఎట్టకేలకు మహమ్మదీయు
లాంధ్రులను ద్రోసికొనిపోయి కోటలోఁ బ్రవేశించిరి. ఆంధ్రు

లకును మహమ్మదీయులకును గొప్ప సంకులసమరము జరిగెను. ఆంధ్రులు వేనవేలు రణభూమిని దీర్ఘనిద్రఁబొందిరి. ఆంధ్ర రణరంగము మహాసంక్షోభముతో నిండిపోయెను. మహమ్మదీయులకు ఉత్సాహము హెచ్చెను. తుదకుఁ దురుష్కులెట్లో ప్రతాపరుద్రుని బంధించిరి. అది శత్రువిజయము. ఆంధ్రులకు దుఃఖము. త్రిలింగసామ్రాజ్యపతనము.

అక్కటా! దుర్భరము! అనేక వీరులకుఁ గవులకు, పస్తులకు దేవతామహీజమై విరాజిల్లిన కాకతీయాంధ్రసామ్రాజ్యమ స్తమించినది. ఆంధ్రమహావీరుల బలపరాక్రమ శౌర్యసాహసములు పావన గోదావరీవాహినియందుఁ గలసిపోయినవి. ఆంధ్రవైభవమంతయుఁ బాడైన ఏకశిలానగరపుఁ గోటకొండల యందు నిద్రించుచున్నది.

ఈ ఘోరయుద్ధమునఁ బ్రతాపరుద్రుఁడు చెఱఁబట్టఁగొనఁ బడి ఢిల్లీకి గొనిపోఁబడెను. ఓరుగల్లురాజ్యము తురకలచేఁ బడెను. కొన్నాళ్లకుఁ బ్రతాపరుద్రుఁడాతని మంత్రులలో నొకనిచేఁ జెఱవిడిపింపఁబడి, యీవలకువచ్చి గోదావరీతీరమునఁ గొన్నాళ్లునివసించి స్వర్గస్థుఁడయ్యెను.



# ఉపవాచకములు

| | | | |
|---|---|---|---|
| 1. | నీతికథామంజరి | అప్రూవుడు | 0-2-0 |
| 2. | భక్తకథామంజరి | డిటో | 0-8-0 |
| 3. | బాలధ్రువచరిత్ర | డిటో | 0-8-0 |
| 4. | బాలకుశలవచరిత్రము | డిటో | 0-5-0 |
| 5. | హనుమంతుడు | డిటో | 0-4-0 |
| 6. | కంసవధ | డిటో | 0-8-0 |
| 7. | రామాయణనీతికథలు | డిటో | 0-6-0 |
| 8. | భారతనీతికథలు మొదటిభాగం | డిటో | 0-6-0 |
| 9. | భారతనీతికథలు రెండవభాగం | డిటో | 0-8-0 |
| 10. | కృష్ణరాయబారం | డిటో | 0-5-0 |
| 11. | ఆంధ్రవీరారాధన మొదటిభాగం | డిటో | 0-12-0 |
| 12. | ఆంధ్రవీరారాధన రెండవభాగం | డిటో | 0-16-0 |
| 13. | ధౌమ్యఋషి | డిటో | 0-10-0 |
| 14. | ఆంధ్రకావ్యసారం | డిటో | 0-12-0 |
| 15. | రఘుకులవీరులు | డిటో | 0-6-0 |
| 16. | భారతపుత్రులు మొదటిభాగం | | 0-6-0 |
| 17. | భారతపుత్రులు రెండవభాగం | | 0-8-0 |
| 18. | నీతిచంద్రిక పరవస్తు చిన్నయసూరి | | 0-6-0 |
| 19. | పంచసంగ్రం | డిటో | 0-8-0 |
| 20. | భాగవత నీతికథలు | అప్రూవుడ్ | 0-10-0 |
| 21. | అభిమన్యుడు | అప్రూవుడ్ | 0-8-0 |
| 22. | మారుతి వాచకం నాల్గవఫారమునకు | | 0-12-0 |
| 23. | మారుతి వాచకం అయిదవఫారం | | 0-12-0 |

మారుతి సాం అండ్ కో, బెజవాడ.

# మారుతివాచకము

| | | | |
|---|---|---|---|
| 1. | మారుతి మొదటివాచకం | అపూర్వ | 0-2-[illegible] |
| 2. | మారుతి రెండవవాచకం | డిటో | 0-3-0 |
| 3. | మారుతి మూడవవాచకం | డిటో | 0-4-0 |
| 4. | మారుతి నాల్గవవాచకం | డిటో | 0-5-0 |
| 5. | మారుతి ఐదవవాచకం | డిటో | 0-6-0 |
| 6. | మారుతి ఆరవవాచకం | అచ్చులో యున్నవి. | |
| 7. | మారుతి ఏడవవాచకం | అచ్చులో యున్నవి. | |
| 8. | మారుతి ఎనిమిదవవాచకం | అచ్చులో యున్నవి. | |
| 9. | మారుతి వాచకం 4 ఫారములకు | | 0-12-0 |
| 10. | మారుతి వాచకం 5 ఫారములకు | | 0-12-0 |

# మారుతి గణితబోధిని

గ్రంథకర్తలు
శ్రీ. రంగారావు నాయుడుగారు B. A., L. T.,
కె. సత్యనారాయణగారు B. A., L. T.,
(ఈ నేటి మా విద్యార్థులకు బాగా పనికివచ్చును)

| | | | |
|---|---|---|---|
| 1. | మారుతి గణితబోధిని మొదటితరగతి | అపూర్వ | 0-4-0 |
| 2. | మారుతి గణితబోధిని రెండవతరగతి | డిటో | 0-6-0 |
| 3. | మారుతి గణితబోధిని మూడవతరగతి | డిటో | 0-8-0 |
| 4. | మారుతి గణితబోధిని నాల్గవతరగతి | డిటో | 0-10-0 |
| 5. | మారుతి గణితబోధిని అయిదవతరగతి | డిటో | 0-12-0 |

మారుతి రాం అండ్ కో., బెజవాడ.

